శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమాల,
హిందూపురము
౧౫ వ పుష్పము

శ్రీ

# అమృతాభిషేకము



గ్రంథకర్త:

మధురకవి బెళ్లూరు శ్రీనివాసమూర్తి





[వెల రూ. 1-25.

ప్రథమ ముద్రణము

1500 ప్రతులు

జూన్ 1959

---

గీ॥ “తెలుఁగదేల యన్న - దేశంబు తెలుఁగేను
తెలుఁగు వల్లభుండ - దెలుఁగొకండ
యెల్లనృపులు గొలువ - నెఱుఁగవే బాసాడి
దేశభాషలందు - దెలుఁగు లెస్స”

---

శ్రీ విష్ణు ప్రింటర్స్,
పిఠాపురం

# గ్రంథమాలకు జీవిత సభ్యులై 116 రూప్యంబు లొసంగిన దాతలు.

1 శ్రీ కల్లూరు సుబ్బారావుగారు, యం. ఎల్. ఎ., హిందూపురము.
2 శ్రీ శింగనమల శ్రీనివాసులుగారు, అడ్వకేటు, కేశవవిలాస్, అనంతపురం.
3 శ్రీ పైడి లక్ష్మయ్యగారు, బి. ఎ. బి. యల్. కమీషనరు,
H. R. C. E. బోర్డు, 3_6/154 హిమయత్ నగరు హైదరాబాదు
4 శ్రీ గోళ్ళపల్లి సీతారామయ్యగారు, శ్రోత్రియందారు, పాపంపల్లి
అనంతపురం
5 శ్రీ కరణం రామచంద్రరావుగారు, శనిగలగూడూరు, తాడిపత్రి తా॥
6 కీ॥ శే॥ ఆత్మారామప్పగారి జ్ఞాపకార్థము,
శ్రీ పి. యల్. నారాయణరావు,గారు బి. ఎ, ఆత్మారాం అండుకో,
అనంతపురము
7 శ్రీ డి. బాబన్నగారు, సారస్వతాభిమానులు, హిందూపురం
8 శ్రీ టి. బయన్నగారు, మునిసిపల్ కౌన్సిలర్, అనంతపురము
9 శ్రీ బి. వెంకటరమణప్పశ్రేష్ఠిగారు, బెస్తరపల్లి, కల్యాణదుర్గము తా॥
10 శ్రీ సి. రామిరెడ్డిగారు, ప్రొప్రయిటరు విశ్వనాథ ప్రెస్, కమలానగర్,
అనంతపురము.
11 శ్రీ బి. జూగప్పగారు, M. A., I. A S., రిటైర్డు కలెక్టరు, అరవిందనగర్
అనంతపురము.
12 శ్రీ చిన్నారెప్పరెడ్డి, మరియు శ్రీరామరెడ్డిగారు, భూస్వాములు
పెద్దవడుగూరు.
13 శ్రీ కాశం శెట్టిగారి రాధకృష్ణయ్యగారు, మేనేజరు వెజిటబుల్ ఆయిల్
మిల్సు కల్లూరు ఆర్. యస్. పామిడి. పి. ఓ.
14 శ్రీ మేడాసుబ్బయ్యశ్రేష్ఠిగారు, మునిసిపల్ ఛేర్ మెన్, అనంతపురము.

## ఉద్ధారకులు (రూ॥ 58_0_0)

1 శ్రీ గొంగడి రామప్పగారు, మేనేజరు శ్రీ దుర్గాప్రసాద్ ఆయిల్ మిల్సు
అనంతపురము

2 శ్రీ యస్. శ్రీ రామరెడ్డిగారు, బి. ఎ., మాడల్ డైరీఫారము
రంగేగౌడు బిల్డింగ్సు, మాధవనగర్ హైగ్రౌండ్సు బెంగళూరు.
3 శ్రీ కంచిరెడ్డిగారి, లింగారెడ్డిగారి ఓబిరెడ్డిగారు, పామిడికొత్తపల్లి.
4 శ్రీ కరణం విరూపాక్షప్పగారు, భూస్వామి కల్యాణదుర్గము.

## రాజపోషకులు (రూ॥ 25_0_0)

1 శ్రీ వై. వి. అశ్వత్థనారాయణరావుగారు, పోస్టు మాస్టరు H. P. O.
అనంతపురము.
2 శ్రీ రొద్దము హనుమంతరావుగారు, ప్లీడరు అనంతపురము.
3 శ్రీ కరణం కృష్ణమూర్తిరావుగారు, భూస్వామి, గంగవరం,
కల్యాణదుర్గం తా॥
4 శ్రీ కట్టా లక్ష్మీనారాయణయ్యగారు, మునిసిపలుకౌన్సిలరుహిందూపురం
5 శ్రీ కట్టా వెంకటశేషయ్య శెట్టిగారు, హిందూపురము.
6 శ్రీ కె. అనంతరామయ్యగారు, మండీ మర్చెంటు హిందూపురము.
7 శ్రీ కట్టా విశ్వనాధయ్య శెట్టిగారు, సేవసరీ మర్చెంటు హిందూపురం.
8 శ్రీ కె. ఆర్. క్రిష్టయ్యగారు, మునిసిపల్ ఛేర్ మెన్ హిందూపురం.
9 శ్రీ పైసాని సూర్యనారాయణయ్య శ్రేష్ఠిగారు, హిందూపురం.
10 శ్రీ దొంతి రావుసాహెబు భీమయ్య శ్రేష్ఠిగారు, హిందూపురం.
11 శ్రీ కె. ఎం. నాగయ్య శ్రేష్ఠిగారు, ప్రొ॥ శ్రీ విష్ణు ప్రింటర్సుహిందూపురం
12 శ్రీ కట్టా రొక్కయ్యగారి సూర్యనారాయణయ్య శ్రేష్ఠిగారు. వైస్
ఛేర్ మెన్ హిందూపురం.
13 శ్రీ వేముల ఏకాంతప్ప శ్రేష్ఠిగారు, పెట్రోలుబ్యాంకు కల్యాణదుర్గము.
14 శ్రీ యస్. నరసింహశాస్త్రిగారు, బస్ ఓనరు కల్యాణదుర్గము.
15 శ్రీ ఎం. వెంకటేశ్వర్లు కొ॥ ముప్పనేని నాగేంద్రుడుగారు,కల్యాణదుర్గం
16 శ్రీ నరసేపల్లి వెంకటస్వామిగారి కుమారు సత్యమయ్యగారు
శ్రీ వెంకటేశ్వర నిలయము పామిడి.
17 ఐ. ఓబయ్యగారు, ల్యాండు లార్డు, కంబదూరు, కల్యాణదుర్గం తా॥

---

(పోషకులాదిగాగల వారిలిస్టు Balance Sheet ప్రత్యేకముగా పుస్తక రూపమున ప్రకటింపఁబడినది.)

# సంపాదకీయము

'Better Late than Never' అను సామెతకలదు. ఎప్పటికి కూడా ఒకకార్యము చేయకుండుటకంటె, ఆ కార్యము ఆలస్యముగానైనను చేయుటయే మంచిదని దీనిభావము. ఈ 'అమృతాభిషేకము' 1958 డిశంబరు నెలలో వెలువడునని ప్రకటించితిమి, కాని అట్లుజరుగక 5 నెల లాలస్యముగా వెలువరింపబడెను. గ్రంథమాలకు స్వంతముద్రాక్షరశాల, లేకుండుటయు, ఆర్థిక సుస్థిరత్వ విరహితమును, దీనికి కారణములు. మా చందాదారులు, అభిమానపోషకాది మహాశయులు, ఈ ఆలస్యమునకు మమ్ము క్షమింతురుగాత !

ఈసంవత్సరము శ్రీ కాశం శెట్టి రాధాకృష్ణయ్యగారున్ను, (మేనేజరు, వెజిటబుల్ ఆయిల్ మిల్సు కల్లూరు ఆర్. యస్.) శ్రీ జూగప్పగారున్ను, (రిటైర్డు కలెక్టరు అనంతపురం) శ్రీ చిన్నావరరెడ్డిగారున్ను, (పెద్దవడుగూరు) గ్రంథమాలకు దాతలుగారిచే మమ్ముప్రోత్సహించినారు. వారికనేక అభివందనములు. శ్రీ చిన్నా రపరెడ్డిగారిచిత్రపటమును,వారిమేనల్లుండైన శ్రీ శ్రీరామరెడ్డిగారు, సకాలములో మాకందజేసిరి. అదేప్రకారము శ్రీ బయన్నగారు, తమ చిత్రపటమును సకాలములోఅందజేసిరి. కాన వీరిచిత్రపటములను ఈ పుస్తకములోప్రకటింపఁగల్గితిమి. మిగతా దాతలను, తమ చిత్రపటములను పంపవలసినదిగా కోరితిమి. కాని వారిదివఱకు పంపలేదు. 16 వ పుష్పములో వారిచిత్రపటములను ప్రకటింప

గల్గెదమని ఆశించుచున్నాము. కొందఱుదాతలు తమ విరాళ మొత్తములలో కొంతమొత్తమును మాత్రము చెల్లించినారు మిగత విరాళములను త్వరలో చెల్లించి, మేముచేయుచున్న సారస్వతసేవ నాదరించెదరని విశ్వసించు చున్నాము.

శ్రీ డైరెక్టరు అఫ్-పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్సు, హైద్రాబాదు వారు, (1) జ్ఞానవాశిష్ఠము (2) భక్తమందారము అనుపాత్తములను తమలైబ్రరీల యుపయోగార్థ మప్రూవుచేసినారు. వారికి మిగుల కృతజ్ఞులము. ఏతత్కారణమున అనంతపురము డిస్ట్రిక్టు బోర్డు స్కూలు ఆఫీసరువారు తమపాఠశాలలకు, ఇన్నూరుగ్రంథములనుకొని, మమ్ము ప్రోత్సాహించిరి. మఱియు డిస్ట్రిక్టుబోర్డు హైస్కూళ్ల ప్రధానోపాధ్యాయులు, మునిసిపలు హైస్కూళ్లు మఱియు మిడిల్‌స్కూళ్ల ప్రధానోపాధ్యాయులు, పై పొత్తములను తమలైబ్రరీలకుకొని మాకు ప్రోత్సాహమొసగిరి. వారికి నేక అభివందనంబులు. వీరిమార్గము ననుసరించి, డిస్ట్రిక్టుబోర్డు పంచాయతీ అధ్యక్షులును, సెంటరులైబ్రరీ అధికారులును, బ్లాకుడెవలెప్మెంటువారును, తతిమ్మా హైస్కూళ్లు, మిడిల్‌స్కూళ్ల హెడ్డు మాష్టర్లును, తదితరులున్న గ్రంథమాల పుస్తకములను, కొని గ్రంథమాల నాదరింపవలయునని మా వేడికోలు.

ఈ అమృతాభిషేకములో 3 భాగములుకలవు (1)ఆంధ్రాభ్యుదయము, ఇందులో ౧౫ శీర్షికలుకలవు (2) వెన్నెలతీగలు

(గేయములు) ఇందులో ౧౦ శీర్షికలు కలవు (౩) ఋతులక్ష్మి ఇందులో ౧౭ శీర్షికలుకలవు. మొత్తము ౭౨ శీర్షికల క్రింద శ్రీ మధురకవిగారు, వివిధ విషయములపై, గానమొనర్చినారు, ఆపాటలలోని తేటలు, అమృత మాస్వాదించి, ఆనందమనుభవింపగల్గు రసజ్ఞులు గుర్తెఱుంగ గలరు. శ్రీ విష్ణువు, మోహినీ వేషమును ధరించి, అమృతభాండము నందుకొని, అసురులను, హావ భావ, విలాస శృంగార చేష్టలచే మరులుగొల్పి, సురలకమృతమును పంచిపెట్టి వారి నమృతాభిషేకము చేయించి వైచెను. అదేరీతి ఈ శ్రీనివాసమూర్తి తమ 'అమృతాభిషేక' గ్రంథభాండమునందున్న ౭౨ సుధాబిందుధారలను పాఠక లోకముపై అభిషేకరించినారు. కవిగారొకచోట 'నాకు విషపాత్రి జూపుచున్నాడు స్వామి — నాకు సుధవోసి త్రావుచున్నది జగంబు - విషములో సుధ, సుధలోన విషము జూచి, క్రొత్తదారులు జనుటప్రత్యుత్తరమ్ము' అన్నారు దీనిభావ మమూల్యముకదా! మఱియొకచోట 'ధ్యానింతుహిమగిరీంద్రము నెడదసంధించి, ప్రేమింతు, నమృతభాండము పెదవి కందించి' అని కవిగారన్నారు, ఆహిమవన్నగములోని పరమఋషులు, పావనగంగ ఆ ఆనందశాంతి జీవనము. అప్సరః కామినుల హావభావములు, ఆయక్షభామినుల విరహవేదనలు, గంధర్వకామినుల సొగసు పాటలు, ఆ దేవకన్యల నాట్యభంగిమలు, ఆ వరూథినీ ప్రవరుల సంభాషణలు, ఆ శివ తాండవము, ఆ కాళిదాసుని కథలు సమ్మో

ళనమొంది, కవిగారిని కౌగిలించినవి. అమృతభాండమును పెదవి కందించుకొన్నారు.

ఇట్లే తుదివఱకు 'అమృతాభిషేకము' నడచినది. తిన బోవుచు రుచులడుగనేల? రసజ్ఞులైన పాఠకులున్నారు, వారి చేతులలో పాత్రమున్నది. అమృతమును చవిజూచెదరు గాత!

ఇట్లు విన్నవించు,

20_5_1959 సంపాదకుడు.

# మనవి మాటలు

మహాశయులారా!

పట్టినపట్టు విడువక, కష్టములకోర్చి, గ్రంధమాల కార్యక్రమమును నడిపించుచున్నాము. విరాళములు వాగ్దానమొనర్చిన వారికి పలుమారులు జాబుల మూలకముగా, వారి విరాళమొత్తములను పంపవలసినదిగా విన్నవించుకొన్నాము. కాన దయచేసి, ఈ పుస్తకము తమ కందిన వెంటనే చందాదారులు, పోషకులు, తమ చందాలను, విరాళములను త్వరలో మణియార్డరుద్వారా పంపి మేము చేయుచున్న సారస్వతసేవను ప్రోత్సహింపవలయునని వేడికోలు.

ఇట్లు,

20_5_1959. మేనేజింగు ఎడిటరు.

## మధురకవి శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తిగారు

# జీవిత సంగ్రహము

ఈ కవిగారి స్వస్థలము అనంతపురం జిల్లా పెనుకొండ తాల్లూక, తలమర్ల గ్రామము. వీరి తండ్రిగారుకూడా మంచి కవులు, ప్రకృతము వీరు, కల్యాణదుర్గం బోర్డు హైస్కూలులో తెలుగు పండితులుగా ఉన్నారు. సరళమైన ఉదారహృదయులు. వీరు పద్యములను, మృదు మధురముగా రచించు నేర్పుగల వారు, 'భారతి'లో అప్పుడప్పుడు వీరి పద్యములు ప్రకటింపబడుచుండును. గీతావాణికి సహాయ సంపాదకులుగా ఉన్నారు. వీరికి 'మధురకవి' 'అభినవ కాళిదాస' అను బిరుదులుకలవు. వీరికి సుమారు 49 సంవత్సరములు.

జీవితమునందలి కష్ట సుఖములు, పుత్రశోకము, వీరి కవితారచనకాధారము. ప్రకృతి వీరి కుపాసనాదేవత. వీరికృతులు, 1 జాముకోడి, 2 జపమాల, 3 కళాజీవి, 4 ప్రేమతపస్విని, 5 అపశ్రుతి, 6 సాన్నిధ్యము, 7 కావ్యగంగ మొదలైనవి. ఇప్పుడీ 'అమృతాభిషేకము, వ్రాసియున్నారు.

గ్రంథమాల కార్య క్రమములయందుత్సాహముగా పాల్గొని, గ్రంథమాలకు పోషకులాదిగాగల చందాదారులను చేర్పించుటయందు శ్రద్ధగైకొను చున్నారు. వీరికి పరాత్పరు డాయురారోగ్య భాగ్యంబుల నొసంగుగాక! వీరుసర్వోత్కృష్టమైన కావ్యములను రచించి, తెలుగు వెలుగును నలుదిక్కులం బ్రసరింపజేసెదరుగాత!

ఓం! తత్సత్

# కైమోడ్పు

నా తపోవన కవిత్వమునకు — ఈ సంపుటి యందలి రచనకు చాలభేదము. అందలి భావతీవ్రత యిందులో లేదుకాని లోకము భిన్నరుచిగలది. నేటి ప్రజాదృష్టి విశేషించి రసభావములకంటె కథావస్తువు నాశ్రయించినదికాగా యిందలి పోకడలన్నియు కాలము ననుసరింపక తప్పినదికాదు. ఈ ఖండికలను ప్రముఖ సారస్వత పత్రికలెన్నియో ప్రచురించినవి. ఆ యా పత్రికాధిపతులకు నా కృతజ్ఞత.

శ్రీ నందూరి రామకృష్ణమాచార్యుల వారికి - నాకును పరిచయమేర్పడి రెండువత్సరములు పూర్తిగడవలేదు. మాపరిచితి గాఢ మైత్రిగా పరిణమించినది. ఆచార్యులవారి హృదయౌదార్యము తాదృశము! మాదుమిక్కిలి నా పుణ్యవిశేషము. వారి సాహితీతృష్ణ — నిష్కళంక కవితారాధన నా కరఖమైనవి. నా అమృతాభిషేకము వారి కందించి ఉపోద్ఘాతము ప్రసాదింప గోరితిని. వారు నా కోరిక ఆనందముతో మన్నించిరి. నందూరి మిత్రులకు నాహృదయార్పణము.

తుదిమాటగా శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాలా సంపాదకులు శ్రీ కల్లూరు అహోబలరావుగారు ఈ సంపుటి ప్రకటించుటలో సర్వభారము వహించిరి. వారి సహకారమునకు నా కైమోడ్పులు.

—బెల్లూరి

# పీఠిక

## సువర్ణ కలశమ్

మధురకవిగా సహృదయలోకమున సుగృహీతనామ ధేయులైన శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తిగారి క్రొత్త ఖండకావ్య సంపుటి యీ 'అమృతాభిషేకము.'

దూరముగనుండి చదువుచున్నపుడు యావదాంధ్రముతో పాటు నాకును శ్రీ బెళ్లూరివారి కవిత్వము 'మధుర' — మని పించినది. కాని — దగ్గరకువచ్చి చూచినపుడు వారి హృద యము మధురాతి మధురమని తెలిసినది. శ్రీ బెళ్లూరి ఆపాద మస్తకము ఆ పాత మధురమూర్తి.

రాయలసీమకు రాగానే, శ్రీ బెళ్లూరి ఉనికిపట్టులనుగూర్చి ప్రశ్నింపగా, 'కవితాతపస్వి శ్రీ బెళ్లూరి కల్యాణదుర్గమున సాహితీ 'తపోవనములో' నున్నాడని మిత్రులు చెప్పినారు. అక్కడకు చేరిచూచిన పిమ్మట వాస్తవమునకు సాహితీ 'తపోవనము' శ్రీ బెళ్లూరివారి హృదయములో నున్నదని గుర్తింపగలిగినాను.

'చదువుల్ నేర్చిన పండితాధములకు' 'చారుమాణిక్య భూషిత శస్తమస్తక పన్నగములు' లోకములో కొల్లలు. నాటక రంగమున బుద్ధ భగవానుని భూమికను ధరించుటవంటిదే.

అహింసనుగూర్చి పద్యములల్లుటకూడ. పోతనవలె త్యాగయ్య వలె కవిహృదయమునకు కావ్యమునకు 'శ్రుతి' గలియుట అరుదు. శ్రీ బెళ్లూరి హృదయమే కరగి కవితయైనది.

క్రొత్తదనమును కనలేక పాతదనము పడుచున్న ప్రసవ వేదనలో యవనికాంతర ధ్రువాగానమై వినపించుచున్న యుగ సంధ్య ఇదంయుగీనుల ఎదలను చీకటి వెలుగులతో వెక్కిరించి కర్తవ్యతా విమూఢులను సల్పుచున్నది.
శ్రీ బెళ్లూరి—ఉదయరేఖలలో

'ప్రాతః క్రొత్తలను సంభావింతు రేకాకృతిన్' అని నవయుగోదయమునకు వైతాళికుడై ప్రాతః స్తవము సల్పుచున్నాడు. ఈ సామరస్యమే కాళిదాసు మహాకవిని స్మరణకు దెచ్చును. శ్రీ బెళ్లూరి 'ప్రకృతి చారుతకు కయిసేతలిచ్చు' సుకుమార హృదయుడు, ఉదయరేఖలు, హిమగిరీంద్రము—ఉషోదేవి—కర్షక ఋతువులు—సంధ్యారవము—సెలకన్నెలు బెళ్లూరి కవితా వస్తువులు. ఇట్టి ప్రకృతి సౌందర్యోపాసకులైన నవకవులు—భూలోకవాసుల కష్టములకు కన్నులుమూసుకొను నివృత్తియోజకులను అపప్రథకు పాల్పడవలసివచ్చినది. కాని — బెళ్లూరి మాత్రము, "భూలోకపు పొలిమేరలు దాటబోయి, శక్తిచాలక రెక్కలు తెగి శూన్యావకాశమున అల్లలలాడు నిరర్థకుడైన కవితా గంధర్వుడు" గాడు.

స్వర్గీయ టంగుటూరి ప్రకాశం, శ్రీ బెజవాడ గోపాల రెడ్డి, శ్రీ నీలం సంజీవరెడ్డి, గాడిచెర్ల హరిసర్వోత్తమరావు

శ్రీ కల్లూరి సుబ్బారావు, శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, శ్రీ శిరిపి ఆంజనేయులు, భౌమానంద సంయమీంద్రులు శివానంద సరస్వతి మున్నగు ప్రముఖులపై వ్రాసిన పద్యశిల్పికలు అనుశీలించినచో, నేటి తెలుగునేలలో వెలుగురేకలు ఎచ్చట కన్పించినను ఆర్ద్రహృదయముతో తలయెత్తి కవితానీరాజన మెత్తిన ప్రోద్దుపొడుపుపువ్వు, 'శ్రీ బెళ్లూరి' అనిగుర్తింపవచ్చును. మంచి యెచ్చట కన్పించినను ఒడలెల్లచేతులై పులకరించిన గుండెతో మోకరిల్లిన బెళ్లూరిని, ఆధునాతన బోధిసత్త్వమను పొట్టి శ్రీరాములు అతిలోకత్యాగవీరము ఉబ్బూతలూపినది. నాదృష్టిలో మాంపులు ముత్తెరంగులు.

ఈగలు : కందిరీగలు : తేనెటీగలు — ఆసేతుహిమాలయము వెదకినను అందరుక్రుళ్లినమనుష్యులై గోచరించు 'ఈగలు' కొందరు. నిష్కారణముగ శీలాపనిందలతో ఇతరులను కుట్టు కందిరీగలు మరికొందరు. పువ్వుపువ్వున వ్రాలి, మకరందము సేకరించు తేనెటీగ శ్రీ బెళ్ళూరి.

పై శిల్పికలన్నియు పరస్తుతి క్రింద జమకట్టి పెదవి విరుచువారును కొందరుండవచ్చును. కాని స్వార్థవిరహితమైన శ్రీ బెళ్ళూరివారి రచనలోని చిత్తశుద్ధి గుండెలోతులు తరచిచూడ గల విజ్ఞులు, గుర్తించి తలలూపకపోరని నా నమ్మకము. 'బోధ్ధారో మత్సర గ్రస్తాః' అని కృత్యారంభముచేసిన భర్తృహరి బ్రదికియున్నచో—సమకాలీనులలోని — అందును సాహితీ సహస్రవణులలోని 'మంచి'ని మాత్రమే చూడగలిగిన శ్రీ బెళ్ళూరి కవి కంటికే కోటివరహాలకమ్మతు గట్టియుండును.

ఈ ఖండకావ్య సంపుటిలోని సెలకన్నె—కవితానైవేద్యము—సంధ్యారవము—వెన్నెల తీగలు, పేర్కొనదగినవి. హిమాలయపర్వత పంక్తులన్నియు ఎత్తైనవేగాని అందు కాంచనగంగ, గౌరీ శంకర్ మున్నగునవి శిఖరములు.

సెలకన్నె 'అరణ్యవాటికావాసమునన్ ప్రశాంతిమయ జీవనముల్' దరించు యోగినిగ కవికే సాక్షాత్కరించినది.

ఆ 'సౌందర్యములో పరాత్పరుని సందేశము' నకు 'ఈ మృదులానిలంబుల చలించు తాండవ శ్రీ మధురానుభూతికి' తన్మయుడైనాడు శ్రీ బెళ్ళూరి.

శ్రీనాథ మహాకవి జయంతికి కవితానైవేద్యము 'కవితానైవేద్యము'. బ్రదికియున్నవారిని పొగడుటకు—చనిపోయినవారిని తెగడుటకు అసాధారణమైన సాహసము అవసరము. ఈ రెంటికి జంకని చిత్తశుద్ధిగలవాడు శ్రీ బెళ్ళూరి. కవిసార్వభౌముని, నన్నయ తిక్కన, ఎఱ్ఱనల కవితారీతులు తనలో రాశీభూతమొనర్చుకొనినవాడని ప్రస్తుతించి,

గఱులన్ విప్పి నభోంతరాళములలో గైసేయు నీ హంసి నే
మరజాలన్ దమయంతి మంజుల వచోమాధుర్య లీలాగతుల్

అని ప్రశంసించియు,

'అంగశృంగారము చెప్ప నీరచనగన్గొని ప్రత్యయమంతలేదు' అని మొగమాటము లేకుండ చాటినాడు. ఇక వెన్నెల తీగలు గేయములు.

గేయ కవితగూర్చి శ్రీ నాథుని చాటువు స్మరించుకొని మూతిముడుచుకొను ప్రౌఢపండితులు నేటికిని లేకపోలేదు గాని తెలుగులో పద్యములో పురుషశీవి, పాటలో లలనా లావణ్యము తొలుకాడుచుండును. ఈ భిన్నప్రజ్ఞలొకే కవిలో మేళవించుట అరుదేగాని శ్రీ బెళ్ళూరివారిలో ఈ అర్ధనారీశ్వర యోగము అద్భుతముగ సంగమించినది.

చాల చిన్నదిరా
నాయిల్లు
చాల చిన్నదిరా
చిన్ని దివ్వెయు లేదురా
నీ రాక
చిత్తమున వెలగూర్చురా

అని ఆతిథ్యమిచ్చుటకు ' చిరుచాపయును లేక, కారుమబ్బులలో కటికె చీకటిలోన వాకిటను నిల్చినస్వామికి కన్నీటితోడనే కాళ్ళు కడుగ నుంకించిన బెళ్ళూరికవి ధన్యజీవి. శ్రీ బెళ్ళూరి యిల్లు చిన్నదేగాని హృదయము మాత్రము విశ్వమంత విశాలమైనది. భవతు !

ఇక-అచ్చటచ్చట పోతనకవితలో వలెనే పునీతము-దారా పుత్రాదుల వంటి ప్రయోగములు దొరలినవి. అట్టివానిని తడు

వుట 'నిరంకుశాః కవయః' అన్న ఆర్యోక్తికి విరుద్ధముమాత్రమే గాదు. మలినములగు చేతి వ్రేళ్ళు తగులకుండ 'అమృతాభిషేకము' నకు కై సేసిన శ్రీ బెళ్ళూరివారి కవితను ఈ సువర్ణకలశముతో రసజ్ఞుల చేతికందించుచున్నాను.

॥ ర సో వై సః ॥

కవితాప్రభాస
అనంతపురము,
6—6—1959

సుమూరి రామకృష్ణమాచార్య





శ్రీ కల్లూరు అహోబలరావు, మేనేజింగ్ ఎడిటర్.

## ౧౧౬ రూ. చెల్లించిన దాతలు



శ్రీ కల్లూరు సుబ్బరావుగారు, M. L. A.

అధ్యక్షులు, రాయల కళాపరిషత్తు.

౧౧౭ రూ. చెల్లించిన దాతలు.



శ్రీ పైడి లక్ష్మయ్యగారు

౧౧౬ రూ. చెల్లించిన దాతలు.



శ్రీ పెద్దవడుగూరు చిన్నారపరెడ్డిగారు

౧౧౬ రూ. చెల్లించిన దాతలు



శ్రీ బయ్యన్న గారు

## ౧౧౬ రూ. చెల్లించిన దాతలు.



పాపంపల్లి సీతారామయ్యగారు

# విషయ సూచిక

# ఆంధ్రాభ్యుదయము

## ఆంధ్రరథము ౧

అదిగో సంగరభూమి నీవిజయ శంఖారావముల్ మ్రోసె; పె
ల్లదరంజేయుచు దిగ్వితానముల నీ యాంధ్రధ్వజశ్రేణులన్
పదిలంబున్ బొనరించి నీయరదమున్ సన్నించితో, శత్రుభీ
ప్రదమై, ఘోటకహేష గ్రమ్ముకొనె పుత్రా కర్ణ! భీభత్సమై॥ 1

నీరథచక్రముల్ గదలి నిమ్నము నున్నతమౌ ధరాస్థలిన్
బారదోడంగ నీవిపినభాగమునందుః ధరాపరాగముల్
దూరగ సర్వభూత తతులున్ భయకంపితమై రయోద్ధతిన్
గూరిన దారుణారవము ఘూర్ణిలు నెల్లెడ తానవ్యాప్తమై॥ 2

పరులన్ నీరథనేమి నిస్వనములన్ బంధించి యీ కోటలున్
బురుజుల్ దాటగనీక వోరెదవు నీపూర్ణోగ్రఖడ్గాహతిన్
తరుగన్ బడ్డవి శత్రుశీర్షములు పుత్రా! నీశతాంగంబు క
న్నరమోడ్వంగనె కానరానిగతి పర్యాయంబునన్ పర్వెడిన్॥ 3

ఉర్వీజంబుల్ ధరణిబడె నీయుద్ధతిన్ ద్రోపులాడెన్ 6
నిర్వీర్యంబై చతికిలబడెన్ నీవు సంచారభూముల్
సర్వంబిచ్చో భయద భయదచ్ఛాయలే పర్వెపుత్ర!
పర్వంబయ్యెన్ తెలుగుభువి నల్వంక నీవేచరింపన్॥ 4

రథ గమనవేగమున సం
శ్లథమానములగుచు నీల్గె శత్రునికరముల్
వ్యథలెల్లమాసె యుష్మ
త్ప్రథ మభినందింపదగిన దాంధ్రకుమారా! 5

## తెలుగుపతాక — ౧

హృదయములందు భక్తినెలయించుచు పల్లెల పత్తనంబులన్
చదలెగబ్రాకు సౌధముల చాయల పేదల పూరిపాకలన్
బొదలి ప్రభాతవాతముల బోరనమ్రోయుచు భావికాల మ
భ్యుదయ పరంపరన్ చెఱగి పోయుచు నాంధ్రపతాక నెల్గెడిన్॥ 1

రెపరెపలాడి మిన్నొరసి రెక్కలు విప్పి చరించు పక్షియై
విపుల శరన్నిశీథి కనువిందొనరించుచు వెల్గుతారయై
అపుడపు డల్లవ్రాలి వినయంబున మ్రొక్కుచు నాంధ్రలక్ష్మి యం
దపు, నునుపైటకొంగు సరదా బురుడించు పతాక భాసిలున్॥ 2

బురుజుల్ కోటలు గట్టి శత్రువులకున్ బోరాక యందందు సుం
దర పల్లీనిలయంబులన్ పెరుగుచున్ స్థైర్యంబువర్ధిల్ల త
త్కరవాలంబుల పాళెగాండ్రు మునుసంధానించి రీనేల, కా
నరె? మీరంచు వచించుచున్ తెలుగుజెండామింట గోరాడెడిన్॥ 3

సమయస్ఫూర్తిని చాటరే తెలుగు ఘోషాస్త్రీలు శృంగారభా
వ మనోజ్ఞత్వముగాని, వీరరస శోభావైఖరుల్ గాని, ఆ

రమణుల్ రాల్చిన లేతనవ్వులక్రియన్ రాపాడి సౌందర్య భా
వముపోషించుచు తెల్గుకేతనముతో ర్వన్ స్వాగతంబిచ్చెడిన్॥ 4

# ఉదయ రేఖలు 3

---

అదిగో ! తూరుపుకొండపై నుదయరేఖావిష్కృతంబయ్యె; న
ల్లదిగో ! కర్ణరసాయనంబు నినదంబందించెనాగేలు, అ
భ్యుదయంబయ్యెడి కర్షకావళికి ప్రత్యూషస్ఫురత్కాంతి సం
పద నవ్యాంధ్రమునందు దోచి ప్రజలన్ పర్వంబు సంధించెడిన్॥ 1

కలకల బలికెడు పక్షులవలె నిద్రామాంద్యమెల్ల వదలి స్వధర్మం
బుల నుత్సహించి సలుపగ దలచెను ప్రజనిర్మలము హృదంతర
వీథిన్॥ 2

పల్లీవాసులు ప్రాచ్యధర్మముల తత్వంబెల్ల నూహించి యు
ల్లల్లన్ తొంటి గృహస్థజీవనము నందాసక్తి రెట్టింప వ
రిల్లన్ జేతురు పూజగాంచు నతిథిశ్రీమూర్తి ముంగిళ్ళలో
వల్లింపబడు రామభారతకథల్ భక్తిప్రబంధంబులున్॥ 3

భర్తల్ దూరమువో మహాప్రణయ సంపన్నాత్ములై లోన, ఘో
రార్తిన్ బొందుచు వారిరాకగని, భార్యల్ పాదపూజావిధిన్
కర్తవ్యక్రమమెల్లసల్పి, సతమున్ గావింప సంతృప్తులన్
కీర్తిన్ బొందెడు గేహినీ పదము భక్తిశ్రద్ధ లేపారగన్॥ 4

విద్యాలయములు సంస్కృత విద్యాపాటనము గలిగి విలసిల్లిన, న
వోద్యమ రీతుల గురుకుల విద్యాపద్ధతులు ధాత్రి పెంపు
వహించున్॥ 5

అమ్మన్ గాంచినయట్టులె, తెలుగుభాషాసక్తి తీండ్రించి పే
రెమ్ముల్ వారగ, సాహితీమధురవార్ధిన్ ద్రచ్చి యెన్నేని ర
త్నమ్ముల్ దీతురు; తెల్గువార లెలమిన్ నన్నయ్యతిక్కన్న స్వ
ప్నమ్ముల్ గాంచుచు, ప్రాతకొత్తలను సంభావింతురే కాకృతిన్॥ 6

దేవుండెందుగలండు మూఢులకు నీదేవాలయంబంచు మా
భావంబుల్ పృథుదేవతాయతనశోభన్ పొల్చెనంచున్, మహా
ప్రావీణ్యంబున బల్కు వర్తనము వేరై యున్న ధూర్తప్రజన్
దైవంబోముత; పుణ్యకార్యతతులన్ తర్కింపగాజేయుచున్॥ 7

గురు శుశ్రూషల, నిష్ఠాపరత్వమున సత్కళా ప్రవర్ధనగతులన్
బెరుగుచు పవిత్రమాశ్రమ దివ్యరోచి నవ్యాంధ్రభూమి యల
రించు ప్రజన్॥ 8

అన్యోన్యతి కుటుంబము,ధన్యతబొరయంగ నింటితనము వెలయగన్
ధన్యోస్మి యనగ చింతాశూన్య గృహమేధి బ్రదుకు సొంపు
దలిర్పన్॥ 9

తానొక సంసారిగ సు, జ్ఞానజలధినీదికొనుచు సర్వేశ్వరునిన్
మానసమున ధ్యానించెడి, వానప్రస్థాశ్రమంబు వర్ధిలుగాతన్॥ 10

ఆసల దిగవిడి, ధీవి
న్యాసము సర్వంబు పరమునందు లభింపన్

వాసము వసతలమైన స
న్యాసాశ్రమ మాంధ్రభూమి కాశీస్సులిడున్॥ 11

## కథాప్రశక్తి ౪

క్రమముగ వృక్షలతాదులు పల్లవ క్రమములయ్యె వనావళిలోన్
సుమములువిచ్చి మనోహరరీతుల శోభలు జల్లె వసంతమునన్
ప్రమదమ్మృదూక్తుల కోకిలయొక్కటి పల్కె స్వకీయ పికాంగనతో
రమణి! వచింపవె? యాంధ్రధరాస్థలి రమ్యములైన కథానికల్॥ 1

చూతు పల్లవఖాదిని సొంపుగులుక
పలుకఁదొడగినదిట్లు నాప్రాణనాథ !
నన్నయాదులులేరు శ్రీనాథుఁడేగె
భక్త కవిపోతనార్యుఁడు ముక్తివడసె॥ 2

ఆంధ్రసారస్వతార్చన కవతరించి
అష్టదిగ్గజములువోయె ; అల్లసాని
లేడు, మనముక్కుతిమ్మన్న లేడు, నేడు
నవ్యసాహితీగతులు విన్నాణమొలికె ; 3

ప్రజలపాలిటి యమరకల్పకమువోలె
తీవరించెడి నవ సాహితీక్రమంబు
ఖండకవితల తీపి ఆఖండకావ్య
వాహినులుపొంగి పొరలి త్రోవపాడఁదొడఁగె॥ 4

మన ప్రణయైకవర్తనము మంజులగీతము నాలకించి నె
మ్మనముల బొంగి నేటి కవి మాన్యులు దివ్య రసప్రబంధముల్
బొనరింతు రెట్టిచుట్టఱికమో, సుకుమార కవీంద్రవాణి పా
వనమగు జీవితంబు లిలపై కడుధన్యము లో మనోహరా! 5

మన నిలయంబులో నిచటిమావులు నీ సెలయేటి ఘుంఘుమ
ధ్వనులు తపస్సమాధి పరతత్త్వములోతులు జూపవే సుభా
షణములు దెల్పునో యుపనిషత్తులు దెల్పునొ కావ్యవాణి పా
వనమగు జీవితంబు లిలపై కడుధన్యము లో మనోహరా! 6

ప్రేయసీ వాక్యములు మది ప్రీతి గొలుప
బలికెమగపిట్ట 'కుహూ కుహూ' స్వనము లొలయ
'అబల, నవ్యాంధ్ర పాలకులైన నేడు
కళల బోషింప బద్ధకంకణులుగారొ' 7

అనిబల్కన్ విని యాడుకోకిలము "నాథా! యేమి వాక్రుత్తు? పా
వన మీరమ్యకళాప్రపంచమున కావ్యశ్రేణి గాంధర్వముల్
ఘనశిల్పంబులు చిత్రలేఖనము లెన్నైనన్ గనన్ వచ్చు; వీ
నిని గాపాడమహోద్యమంబులవి యెన్నో సాగె నీరోజులన్ 8

సాహితీ పోషణముమున్ను సలిపినారు
రసపిపాసువులైన సామ్రాట్టులెవరొ
నేడు సాహిత్యలతికల నీరువోసి
పెంచుచున్నారు ప్రజలె పవిత్రగతుల 9

అరి వక్షస్థలశోణితంబులు కృపాణానీకముల్ ద్రావ సం
గరభూమిన్ విహరింతురే మృదుకళాగర్భంబులేసిన్ సుధా
ధరమర్పించి సుఖానుభూతిగను విద్యావేత్తలౌరెడ్లు మం
తిరివర్గంబున జేరిరే కొదువలేదీ సాహితీవీథులన్ " 10

అని యమృతోక్తులన్ నుడువు నంగనరెక్కలు గప్పి చేరదీ
సిన యరమోడ్పుకన్నుల వసించె నిమేషము నాథుకౌగిటన్
దినకరుడంతలోన నవదీధితుల్ ప్రసరింపజేయ త
ద్ధ్యానమునువీడి యాప్రణయ దంపతులేగిరి మేతకోసమై॥ 11

## తిరుపతి విశ్వ విద్యాలయము :



అరుదై భక్తజనావళుల్ నిలువ పుణ్యక్షేత్రమై పొల్చె సుం
దర స్వర్ణాంకిత గోపురంబు లవిగో! తారాపథంబంటగా
వరుసల్ దీరుచు దేవతాయతన సౌభాగ్యంబు జూపట్టు నీ
గిరిపేరేమొ? మనంబు తన్మయముగా కేల్మోడ్తు నిచ్చోటునన్ 1

గిరిసప్తకంబు వాలిసెడి తిరుపతియా! సాధుజనుల దివ్యస్థలమా?
పరతెంచు యాత్రికావళు లెఱగదరో స్వామివేంకటేశ్వరునిచటన్ 2

ఎన్నికోనేళ్ళు తీర్థంబు లెన్నిగలవు
ఇందు పావనోదకముల యందు గ్రుంకి
పాపతతి వాయుదురు భక్తిభావమునకు
నెన్నిసోపానములు నిల్పి రేర్పరించి 3

అందంబై శ్రవణోత్సవంబగుచు ఘంటారావ మల్లంతలో
నిండే యాపృథుదేవతా నిలయమందే మ్రోగు 'గోవింద గో
విందా' యంచు సమస్తభక్తతతి యుప్పొంగారి పూజార్థమా
నందోపాసకులై రి; యెల్లెడల మంత్రధ్యానమేపారఁగన్ 4

సంగీతాది సమస్తసత్కళలకున్ స్థానంబుగా నెంచి స
ర్వాంగంబుల్ పరిశోభితంబుగ నొనర్పన్, విశ్వవిద్యాలయం
బుగల్పించిరి యాంధ్రనేతలిచటన్ ; పూర్ణాయువుల్ బొంది యీ
బంగారంబగుచోట నీయది ప్రజాభావంబు చూరాడెడిన్

# ఆంధ్రకేసరి ౬

నవ్యాంధ్రోద్యమ కార్యరంగమున నానందంబె సర్వస్వమై
దివ్యంబై నడిపింపగా హృదయ మందీషా ప్రపూర్ణాత్ముఁడై
భవ్యంబౌ తపమాంధ్రకేసరి యొనర్పంజూచి కీర్తించెడిన్
గావ్యశ్రేణి జనమ్ము దత్ప్రతిభ నాకర్ణించి ముగ్ధంబుగన్

కలిగిన యంతరాయములకై తలయొగ్గఁడు ; జ్ఞానదీపికా
వళిఁ దమసంబడంచుకొని పైనమొనర్చెడు, నార్యమార్గపుం
బొలములలో కృషీవలునిపోలిక రేలుబవళ్లుఁబుచ్చునా
తలఁపున భావిలోకములు తాండవమాడెఁగళానుభూతితోన్

ధర్మముఁదప్పఁడెన్నఁడు, వ్యథా భరభగ్నజనాళి కోసమై
కర్మమొనర్పు, నేపనులు కాలము దేశము జూచిసల్పు, న

లోస్ఫూర్తిఁగలంచుధీరత మహోదధి దాఁటెను రాజకీయపుర్
మర్మమెఱింగి యీసచివ మాన్యుఁడు ధర్మత వృద్ధసింహమై 3

నంపులఘువ్వ మానసచివవర్యుఁడటంచుఁ గవీంద్రుఁడొక్కఁడు
జ్వలగతి మార్గకావ్యముగఁ బల్కఁగ నొక్కఁడు దేశికావ్యముం
బలుకఁగ తందనాన పదపద్ధతి నొక్కఁ డుయాల లూఁప, మా
తెలుగుసరస్వతిం గృతమతిం బొవరించెద రాంధ్రపుత్రకుల్ 4

చిరతపస్సిద్ధిఁబొందిన హృత్సీమయొల్ల
ధారవోయు కవీంద్రుల దారిఁదొక్క-
యున్ని నిర్మాణకార్యము లెంతలోన
సలిపె నాంధ్రోర్వి మన ప్రకాశప్రధాని ! 5

ఏమి యొసరించి రాంధ్రు లెగ్గెత్తి యేక
కంఠముగ మంత్రికోనియాడ గలరుగాని
ప్రజల జీవనమునకునై పాటుపడెను
ఘనులకియ్యది సహజ సద్గుణము కాక 6

## గోపాలరెడ్డి ౨

అతని జన్మకారణమున నతి పునీత
మగుచు బెజవాడపురి ధన్యమయ్యె నతని
మొగము నందము జూచి సమ్ముగ్ధమయ్యె
నాంధ్రజగతి యుత్తమశీల మతనిసొమ్ము 1

ఆతఁడాంగ్లేయ సారస్వతాబ్ధి తరచి
తద్రసాస్వాదనంబున దనిసిపోయె
తెలుగు భారతి పాదధూళులు స్వకీయ
మస్తకముజేర్చి మోద సంభరితుఁడయ్యె 2

అలరవీంద్ర కవీంద్రుని యాశ్రమమున
పూతభూస్థలి శాంతి నికేతనమున
అతఁడా వంగీయసాహితి నభిలషించి
హృద్యభావ గంగాఝురి నీదులాడె 3

అతఁడు దేశాభిమాని సర్వాంధ్రసీమ
కాతఁడధినేతయై సచివాసనమున
నాతని పవిత్రమూర్తి జోహారులందు
కొనియె తెలుగువారల మేలుకొలిపె నతఁడు 4

అతఁడు గోపాలరెడ్డి సర్వాంధ్రభూమి
నల్లముఖ్యాంగి విజయ దుందుభులు మొరసె
నతని పరిపాలనంబున నతనికనుల
పరువులెత్తెను నాంధ్ర గర్వస్రవంతి ! 5

## భావ జ్యోతి రా

---

ఆరత్నం బవనీ పరాగ మలినంబై తొల్తజీవించె ; స్వే
చ్ఛారమ్యాకృతినొందె కాలగతితో సర్వాంకషంబై , ప్రభా

పూరంబుల్ విరియించి తెల్గుభువి నుద్బోధించె; కల్హారు సు
బ్బారావుల్ గనుదోయి నిల్చినది; భావజ్యోతి రూపొందుచున్ 1

ధీరోదాత్తత రాజకీయముల నుద్దేశించు సాహిత్యపుం
దారుల్ బట్టి, ప్రశాంతభావమును సంధానించు రాజర్షియై
ఆరాధించు సమగ్ర సత్యము నితాంతాసక్తి కల్హారు సు
బ్బారావుల్ గనుదోయినిల్చినది; భావజ్యోతి రూపొందుచున్ 2

పారావారతరంగ ఘోషము, మహాభ్రాక్రాంత కల్పాంత ఘో
రారావంబు, సమీరక భూస్థలి నగారామోగ్రత, లేకాకృతిన్
ధారాపాతముగా సభాస్థలుల నుద్ఘాటించు, కల్హారు సు
బ్బారావుల్ గనుదోయి నిల్చినది; భావజ్యోతిరూపొందుచున్ 3

నడువీధిన్ పెడకెక్కలన్ బిగిచి, నిన్నానాడు బంధించి తె
చ్చెడి పోలీసుల నవ్వుమోమడరగా, 'జేబాపుజీ' యంచు నీ
యుడుకుల్ రక్తకణాలలో, నొదగి యుత్సాహముప్పొంగ ముం
దడుగుల్ వైచుచు జైళ్ళయాత్ర జను నీత్యాగంబు నగ్గించెదన్ 4

పరదాస్యంబునమగ్గ, శుష్కతనుశోభన్ చూడలేనంచు, నీ
భరతోర్విన్ నిజమాతృమూర్తి నెదసంభావించుచున్, బాష్ప ని
ర్ఝర నేత్రంబులుమోడ్చి, మెపులనరింపన్ ప్రేమగీతీసుధా
ఝురి నోలాడితి! యోగిమార్గమిది నీశాంతిన్ ప్రశంసించెదన్ 5

అరదంబెక్కిన పార్థుడోయన, నుపన్యాసాగ్రవేదిన్ భయం
కర వాక్కుల్ శరజాలముల్ బరపుచున్ గర్జించుచో, దేవద

త్రవంబై, ప్రతిపక్షవర్గములు నీధాటిన్ పటాపంచలై
కురుసైన్యమ్ములు వోలె విచ్చినవి; నీక్రోధాగ్ని నూహించెదన్ 6

తెనుగున్ కబ్బము లల్లుచున్, రసధునిన్ తీర్థంబులాడించు, స
జ్జనులన్ సత్కవులన్ మహాసభల పూజాభావనన్ గొల్చి నె
మ్మనముల్ దన్పుచు, సాహితీగతుల బ్రహ్మానందమున్ బొంది పా
వనమున్ సల్పితి జన్మ నీమృదుకళా బంధుత్వ మర్చించెదన్ 7

పరమాదర్శము గాగ పెంచితివి, సుబ్బారాయ! కల్లూరి వం
శరమన్ ప్రాజ్ఞులు దేశనాయకులు సంస్కారప్రియుల్ ధీరులెం
దరో వీరందరిలోన మానికముగా తర్కించి, నీసేవలో
పరితృప్తింగని పొంగిపోయె ప్రజ; నీభాగ్యంబు కొండాడెదన్ 8

## భావశుకమున్

పరమార్థంబు గ్రహించి, తానెఱుగు తత్త్వంబెల్ల బోధించి యీ
ధరణిన్ స్వర్గముగాగ మార్చగల వర్త్మంబంది యత్యంత సుం
దర మాధ్యాత్మిక జీవికన్ గడుపు రాధాకృష్ణునాంధ్రప్రజల్
చిరకాలంబు తపించి పొందిన, ఫలశ్రీవోలె వెల్గొందెడిన్ 1

గఱులల్లార్చుచు పంజరాంతరమునన్ కంపించి నీచిల్క యీ
తరుశాఖావళి పల్కు; నాచిలుక తత్త్వంబిట్టిదేయంచు లో
క రహస్యంబొకమాటలో తెలుపరే జ్ఞానుల్ తదానంద బం
ధుర గీతంబుల నాలపించు మతిమంతున్ గాంచి రాంధ్రప్రజల్ 2

ఇరుల గనుమోడ్తు వృక్ష కోటరములందు
వెలుగు దోపగ విహరింప గలనటంచు
లలిత లలితంబు తెల్గు పొలాన నిల్చి
పలుకుచుండె రాధాకృష్ణ భావశుకము ! 3

బహు దేశాంతరగామియై హృదయము సంస్పందంబుగా బల్కె, న
య్యహితాత్ముల్ తనవారలై తగ, వివేకానందుఁడేమో, ప్రజా
సహకారంబున రామచిల్కవలె భాషామాధురిం గూర్చి యి
మ్మహనీయుండొసగూర్చెషిక్ నిగమ సామ్రాజ్యైక
సౌఖ్యోన్నతుల్ 4

మును ఋషిపుంగవుల్ బ్రతికిపోయిన సీమల భారతోర్వరన్
మనుగడబుచ్చి విప్లవ దుమారము రేగిన పట్టులందు దు
ర్దిన తమసావళిన్ దొలచి దీధితిపించు సభోమణింగనున్
గొని హృదయార్చనల్ సలిపికొల్తురు దివ్యరసానుభూతితోన్ 5

పధరోక్తుల్ తొలుతబలికెన్ ఈశ్వరప్రేమనొందన్
సాధువ్రాతంబనుపమ సుధా స్వాదు ధారాస్రవంతుల్
ఆధరోక్తుల్ వినిచి ప్రజలందజ్ఞతా దోషమార్పన్
రాధాకృష్ణ ప్రణయగతికిన్ ప్రాంజలిం గూర్తురేషన్ 6

## త్యాగయ్య ౧౦

కనుగవ నీరుదెచ్చు కుతుకంబున నృత్యము సల్పు; 'రాఘవా'
యను; 'మరుగేలరా' యను; భుజాగ్రము నందిడికొన్న తంబురా

వినదములో సుధాద్రవము నించుచు పేదపడంతియొూర్తు కీ
ర్తన వినిపించు చున్నదదిరా! ధనవంతుల యింటిముంగిటన్ 1

ప్రొద్దుపోయిన దీవేళ పోయిరావె
యన్న నుడులేవొ వినవచ్చె నాగృహాన
లలన ప్రతిబింబ మొక్కటి నిలువుటద్ద
మందు గానంబడెను వీథి యందునుండి 2

దర్పణము మోల్పిలనిల్చి ముస్తాబొనర్చె
మదవతి యొనర్చుచున్న యా మందలింపు
చెవులబడినను ఆకటి చిచ్చుబాధ
కదలనీదయ్యె నాబిచ్చ కత్తెనపుడు ;

అస్ఫుటమ్ముగ క్రమ్మఱ నాలపించె
త్యాగరాయల కృతి యామె తలుపుచెంత
కసరుకొన్నది లోపల గడపనుండి
దాసి గాబోలు 'చెప్పలేదా' యటంచు 4

హృదయముత్యాగరాట్కృతులయించిఁదో మధురాంధ్రనాహితిన్
జదివినదో పురాణములు శాస్త్రముఁలన్ గని విశ్వసించెనో
సుదతియొకర్తు ప్రేమమయ సూక్తుల బిల్చెను ప్రక్కయింట న
భ్యుదయముగన్న రాష్ట్రము నవోదితమామెకు సౌఖ్యమీవుతన్

'తల్లీ!' పెట్టవెయంచున్
అల్లన భిక్షంబు గొనుచు నాయమ గృహిణిన్

'సల్లంగా వర్ధిలు నీ
యిల్లని' దీవనలు పలికి యేగె; నెచటికో 6

హృదయ మోహిని త్యాగరాట్కృతికినింత
యలరి పోయినమది, తనయట్టివేద
కనికరించిన హృదయ మీతెనుగు భూమి
చెలువు గులికెడు చిర తపస్సిద్ధియేమొ? 7

## పంచనదములు ౧౧

పావన జలముల సస్యశ్రీ వెలయగజేసి తెనుఁగుసీమ నౌరసి గో
దావరి ప్రవహించెడు, చేతోవీథి స్మరింప వలవదోయాంధ్రసుతా!

కృష్ణాతరంగమాలల నిష్ణాతులు పడవనడుపు నేరుపు గని, నీ
యుష్ణోష్ణ రక్తనాడుల తృష్ణాలత బెంపవలవదే! యాంధ్రసుతా!

కావేరీ సలిలంబుల భావము సుస్నాతమగుచు భాసింపగ, నీ
త్రోవల నాంధ్రౌన్నత్యపు మావుల తోరణము ప్రేలు
మాటికి పుత్రా!

భంగముల నాట్య సుందర భంగిమ వికసింప తుంగ భద్రానదిలో
పొంగారు కళకు, నీ సర్వాంగము పులకింప నలువు మంజలిపుత్రా!

పెన్నానదీ మనోజ్ఞత కన్నుల కలిమికి ఫలంబుగాగనుఁగొని, యే
తన్నీరమ్ములలో నీపున్నెమ్ములతోట బెంప బోలును పుత్రా!

# స్వాతంత్ర్యసిద్ధి-పొట్టి శ్రీరాములతపస్సు౧_౨

తనసర్వస్వము దేశమాత మృదు పాదద్వంద్వమందుంచి ప్రా
క్తన ధర్మాధ్వగుండై యహింసయని సత్యంబంచు బోధించి, గీ
త నుపాసించి మహాతపస్వియయి స్వాతంత్ర్యోద్యమానంద దీ
క్షను కన్మోడిచె నామహాత్ము డసువుల్ స్తంభింప ఢిల్లీపురిన్ 1

నాడు—సమ స్తవిశ్వమెదనాటిన దుర్భరశోక వహ్ని సం
పీడితమయ్యె, కాలగతి విస్మృతిబొందె విషాదరేఖలే
వాడల సత్యశీల సచివాగ్రణి పూజ్యుడ నేతమయ్యె మా
రాడని భక్తియుక్తి భరతావని యెల్ల జోహారుసేయగన్ 2

ఇది ప్రజారాజ్యమనుచు సమ్ముదితుండయి, మహోత్సుకత్వము
జూపె నెహ్రూ ప్రధాని
జయము నవభారతమునకు జయమటంచు విశ్వముఖమున
మ్రోసె పవిత్ర ఘోష 3

ప్రాచీన హైందవ ప్రాభవంబుల నెల్ల కుతుకంబు పెంచు భారత
పతాక!
అలహరిశ్చంద్రు సత్యవ్రతాదరణంబు రగులించు నెడద భారత
పతాక!
పాండవాగ్రజునియఖండశాంతివిధంబు రాజిల్ల జేయు భారతపతాక!
గౌతమ బుద్ధుని కారుణ్యగీతంబు స్మృతివీథి దేల్చు భారత
పతాక! 4

అల అశోకుని హృదయ నిర్మలతయెల్ల
నెతల మఱపింప జాలు భారతపతాక !
అల సబర్మతియోగి కరాగ్రసీమ
రమ్యగతి తాండవించు భారతపతాక ! 5

కనులఁ గౌగిళులిచ్చి దన్పెడు పతాకచ్ఛాయ గూర్చుండి యాం
ధ్రుని తేజోవిభవంబులెల్ల మదిలో దోగాడ నవ్యాంధ్రరా
ష్ట్రనిరీక్షాపరితప్త చిత్తుఁడగుచుఁ బ్రాయోపవేశంబునం
తనువర్పించి తరించె జీవితము తానై పొట్టి శ్రీరాముఁడుం 6

ఆంధ్ర భూనాయకుల గాథ లాంధ్ర మంత్రి
పుంగవుల జీవితంబుల, పూర్వకవుల
ఆంధ్రకావ్య నిర్మాణ రహస్యగతులు
త్యాగమూర్తి తలంపులో దోగనేమొ 7

మాకృష్ణావనినాథుఁడాంధ్రభువి సామ్రాట్టయ్యె, స్వర్ణప్రభా
నీకంబుల్ వెదజల్లఁగా బడియె నెందే వీథులందెల్ల, పూ
రేకుల్ వోలిన తెల్గుకైతలెట నర్తించెఁ సుధామాధురుల్
వాకల్ గట్టిగ తీరుతీయములు సంవాసింప భావోర్విలోఁ 8

గతకాల ప్రతిభావిశేషముల నైక్యంబొంది యానాటి కీ
రితి పోషింపగ నాంధ్రకేసరి యొనర్చెఁ గాఢయత్నంబు నే
డతిలోకంబగు నాంధ్రపీఠమున సధ్యాసీనుఁడై పొల్చె, పూ
జితులా రెడ్డి వరేణ్యులే సచివులై చేదోడు వాదోడుగఁ 9

పదనౌకత్తుల కేలఁదాలిచి నిజప్రత్యర్థి శీర్షంబులన్
చిదుమన్ గొట్టు మహోగ్రకార్యముల పూఁచెన్ రెడ్డికీర్తిప్రభల్
హృదయం బిచ్చి కళాపరంపరల తామేలీల పోషించిరో
మృదువున్ గార్శ్యమునైన వారిమది పొల్చెన్ భావవైచిత్రితోన్

## శ్రేయోభావన ౧౩

ఎన్నోగాథల్ తెలుఁగుభువిలో హృద్యముల్ త్రవ్విపోయన్
వన్నెల్ గూర్చెన్ కవితకు రసస్వాదు మాధుర్యలీలన్
తన్నిర్మాణంబమృతఫణితిన్ దాకుచున్ గావ్యగీతిన్
పున్నెంబారన్ పలుకుము, తపఃపూర్ణులై సోదరాంధ్రుల్ 1

భావంబెల్లన్ తెలుగు పొలమై, ప్రాచ్యధర్మానురక్తుల్
తీవెల్ తీవెల్ పెనఁగొను క్రియన్ రేఁగుచున్ తోడుసూపన్
ఏవోవాచ్యప్రకృతు లొకచో నొంచి-వ్యంగ్యమ్ములాయా
త్రోవన్ నానాకళల సొబగుల్ వోసి పోషింపుడాంధ్రిన్ 2

పోయెన్ శూన్యంబగుచు కథలై పోయె వర్ణాశ్రమంబుల్
పోయెన్ సత్యం బమితదయయున్, బుద్ధసందేశ సూక్తుల్
పోయెన్ నీతి క్రమములలో పూజ్య సంస్కార రీతుల్
పోయెన్ పూర్ణంబయిన బ్రతుకుల్ ప్రొద్దుగ్రుంకైన మాడ్కిన్నే

ఆతిథ్యంబున్ సలిపి ప్రమదంబందఁగా గేస్తులెల్లన్
పాతివ్రత్యం బెపుడు మహిళాభావముప్పొంగఁజేయన్

జ్యోతుల్ వోలె వెలుగుచు బుధస్తోమ మాశీస్సువోయఁగా
ఖ్యాతిఁ గాంచఁగ పరిమళ సుమోద్యానముల్ తెల్గుతీరుల్ 4

ఆయుర్వృద్ధిన్ బడయు పరమంబాంధ్ర రాజ్యాంగనీతుల్
పోయిఁ బెంపన్ మదికి లలితంబాంధ్ర గీర్వాణ భాషల్
న్యాయ శ్రీలన్, జెలఁగ విపులంబాంధ్ర వాణిజ్యవీధుల్
శ్రేయస్సౌఖ్యం బొడవి తెనుగున్ సీమ వర్ధిల్లుగాతన్ 5

# ఆంధ్రప్రవాసి ౧౪

---

తను కావించిన దుష్కృతిన్ గని ప్రభుత్వంబుగ్ర శిక్షాగతిన్
బనుపన్ దూరముపోయి దుర్వ్యథలు పైపై రేఁగ ద్వీపాంతరం
బున నాంధ్రుండు ప్రవాసి, స్వీయభవనంబున్ ప్రేయసీరత్నమున్
తన సంతానము, మాతృదేశము నితాంతంబాత్మ ఖేదింపఁగన్ 1

బలువగిల దూలు, కనుఁగవ
నలమిన యశ్రూదకముల హస్తాంగుళులన్
దొలఁగింగ దోయుచు, నిట్టూ
ర్పుల గాడ్పులు వెలిఁబుచ్చు, లోఁజ తించున్ 2

కలుగునె మాతృదేశమున గౌరవమిచ్చట మానవోత్తముల్
కలిసి పరస్పరంబు 'సహకారగుణంబున' వాల్తురే, మహో
జ్జ్వలమగు నాంధ్రభూమి కేగవచ్చునె పైరులు పండలించదు నా
తలపులు నగ్నికీల లెగదట్టెడు శూన్యములీ ప్రదేశముల్ 3

ఘర్మజ్యోతి వెలింగిపోయినది సాంద్రానంద మాంధ్రక్షమన్
ఘర్మంబూడ్చి పరిశ్రమించు హాలికుల్ గాపాడ, సౌందర్య భా
వోర్మిల్ తాండవమాడ స్వర్గభవనంబున్ బోలు నాసీమ—లో
నూర్మిన్ బెంచెడిసీమ—నాతలపుదాకున్ స్వప్నభాగ్యంబుగన్ 4

అతిథుల కభ్యాగతులకు
కుతుకంబున వడ్డనములు కూర్పగ గేహ
స్థితిగతుల చక్కదిద్దగ
సతీమణుల కాంధ్రభూమి స్థావరమగునో! 5

పే సహవాస సౌఖ్యములు నెయ్యములెల్లద వీయమైన, స
న్యాసివలెన్ చరించుచు మహావ్యసనంబున కన్నుమోడ్తు న
భ్యాసము లేనివాని కలవాటులు సేయగలేని జీవితం
బో సహధర్మచారిణి, యయో యొకయాంధ్రుఁడునై పజాలునే 6

నా లేమి మఱచి, బుమతలు
కాల క్రమభంగి, తావ కప్రేమ సుధా
లీలాపూర్ణ విలోకన
జాలంబుల నీడబ్రిదుకు చవి గనియెదరే! 7

నీకుఁ నేర్పెడి వాఁడగానయిన తన్వీ, లోనియారాట మ
ఙ్త్రాకఁ బెట్టెదు, బిడ్డలుఁ గనుము నీ ప్రాణంబు ప్రాణంబుగా
నాకో నీకును వృద్ధదంపతులుగా—నాకన్న వారిఁ, విషా
దాకీరంబగు కాలముఁ సలుపు. పూణాంబూగటుల్ వోసెడిఁ 8

తన దారా పుత్రాదుల
మనమున దలపోసి స్వార్థమయమగు నాలో
చనవిడి పరార్థ చింతా
జనితంబగు దేశభక్తి సంధించి యెదన్ 9

హృదయ సరోవరంబున రహించిన ప్రేమ పయస్సులందు స
మ్మదమున రాజహంసముల పోలిక నీదెడు దేశభక్తులన్
వదలి ప్రవాసి భిన్నమతి వందురుచున్ దినమే యుగంబుగా
వదలుదు నేమొ వ్యర్థముగ ప్రాణములీ విషమ స్థలంబునన్ 10

ప్రాచీనాంధ్రుల శౌర్యదీప్తులకు, నవ్యాంధ్ర ప్రశాంత ప్రభా
వీచీ మాలకు కేలుమోడ్చెద, మనోభీష్టంబు సిద్ధింప నా
వాచాశక్తుల ధారవోసెద నిటన్ భవ్యాంధ్ర తేజంబు, సం
కోచం బేటికి ధర్మనిర్వహణకై కోరాదు నాజీవముల్ 11

బీళ్ళెల్లన్ మహాదాంధ్ర నాగరకతా బీజంబులన్ జల్లి వ
ర్ధిల్లన్ జేసెదు సస్యపుంజముల నీదీవిన్, మనోవల్లరుల్
మల్లెల్ పూయు పరీమళింప నిచటన్ మాధుర్మధుర్యంబుగా
పల్లీసీమల, పత్తన ప్రజల, శోభన్ దేర్తు నంతంతలన్ 12

తెనుఁగు జాత్యాభిమానంబు తేర్తు నిచట
తెలుఁగు పౌరుషమెల్ల బోధింతు నిచట
తెనుఁగు రాచరికంబు సంధింతు నిచట
తెనుఁగు తబిసికై ముక్తి సాధింతు నిచట 13

అనివార్య మీ ప్రవాసము
క్షణికముగాఁగ గడపి మగుడ స్వస్థానములో
మనుగడను బుత్తు, కాదే
మన యాంధ్రులు స్మరణవీధి మన్నింతు రనన్ 14

ఒక క్లిష్ట కారణములో
నొక కార్యాచరణ, దైవయోగంబిది, నే
నిక ధన్యుఁడనని యాతఁడు
వికసిత మతియగుచు కాలవీచిక దోఁగన్ 15

# సంజీవరెడ్డి గారు

---

వేదికల నెక్కి ప్రజల హృద్వీథులందుఁ
దలఁపు జరెవర్తనము నాఁగూర్చు, దారిగంటె
భావముల నెల్ల కావ్యరూపమున నునిచి,
సేవ యొనరించి పదనొడఁగె సంజీవరెడ్డి 1

రమ్మోయ్యా! సచివాగ్రణీ! తెలుఁగు ధర్మంబుల్ల గాపాడుచున్
సమ్మోదంబిడుమన్న యీ ప్రజలకున్ గై మోడ్పి సేవారతిన్
'మిమ్మున్ గొల్చెదనంచు ధైర్యమిడు నన్నేదీవలోన్ నిసి పూ
రెమ్మల్ బోలు నుదాత్తభావు జనీ, రెడ్డిగ్రణీ భూషవే! 2

పల్లీ జీవనపుం జవుల్గలిన శోభామూర్తి, బాల్యంబునం
గల్లోలంబుల నెన్నొదాఁటి నలసద్గంభీర తేజస్వి; మున్

ఢిల్లీజవ్హారు నెహ్రు మన్ననల నందెం బ్రాభవోపేతుండై
ఇల్లూర్పల్లియ జన్మభూమి ; యతండెన్నే యేండ్లు వర్ధిల్లుతన్ 3

ఈ యఖిలాంధ్ర ధారుణి జరించినవాండు, ప్రజానురక్తి కిం
బాయని సత్యభావమున పల్కెడివాండు ; వివేకశాలి ; యె
య్యేయెడ నెట్టికష్టగతి నెవ్వరు గుందుదు రట్టివారి నా
యాయెడఁ దత్తదర్హపథమారసి సత్కృతి నిర్వహించెడిన్ 4

విద్యుద్దీపము లాంధ్ర భూతలముఁగన్ వెల్గన్ జలాధారముల్
సద్యోరీతి నొసంగఁ గంకణముఁ దాల్పన్, గార్యరూపంబులో
నుద్యోగింపఁ బ్రధాని వత్సలత నోహో శ్లాఘ్యమై, దివ్యమై
హృద్యంబై యిదిగా దలంచి ప్రజలర్థిం గొల్చి రాత్మీయునిన్ 5

సంజీవరెడ్డి సద్గుణ
పుంజము, సర్వాంధ్ర జగతి పూలు ఫలాలై
రంజింపఁజేసి ప్రజలిడు
నంజలిఁగొనుఁగాక నృపుల యంశాన్వితుఁడై 6

పరమౌదార్యము పండి నీమృదుల భావక్షేత్రమార్గంబు సుం
దరమై యున్నది కర్షకోత్తమ, ప్రజాధర్మంబు ప్రాభాత స
వ్య రసోజ్జీవనమేల పొందదిక భవ్యస్వాగతం బిచ్చు నీ
పరమై రాయలసీమ మంజుల ముఖద్వారంబు మంత్రీశ్వరా ! 7

ప్రతిప్రజాహృదయ మున్నతరీతి రాజకీ
యప్రభారాశి నీ కంజలించు

ప్రతిసభారంగ మద్భుతరీతి తావకా
   ధ్యక్షత వలచి జోహారులెట్టు
ప్రతికళానిలయ మప్రతిమానరక్తి ని
   న్నమరకల్పముగాగ నభినుతించు
పౌరి తెల్గుగేహ మంచిత భవద్దర్శనా
   ప్రేక్ష ముంగిళ్ళ సంప్రీతి నెఱపు

పొగడికల వంటిమాటలు ప్రోవుగాదు
సదమలంబైన దివ్య రసస్రవంతి
హృదయ ముప్పొంగి పొరలిపోయినదిగాని,
నీవు ధన్యుఁడవోయి సంజీవరెడ్డి! 8

అల రాజ్యాంగము పంటభూమియగు, నీవత్యంత శ్రద్ధాళువై
హలముం గేలధరించి దున్నితివి, సస్యంబెల్ల పెంపొంది క
న్నులకానందముగొల్పు, కంచెనడి తన్మొక్కంత పోషించి, గా
దెలలో ధాన్యమునింపగా, నదను గాదే నేఁడు! రెడ్ర్యగ్రణీ! 9

కవి వాక్యావళి పూలమాలలయి నిన్ గైసేయ నాశీస్సు దా
నవ మేఘంబులు వర్షముం గురియు, లోకంబు కాంక్ష రేకెత్త, నీ
జవ సత్త్వంబు ప్రజాహితప్రకృతి సంస్కారంబులో పక్వమై
ప్రవచించున్ మధురోపదేశము కుమారా! శాంతిలీలాగతిన్ 10

# విషయ సూచిక



# వెన్నెలతీగలు

## నవభారతయోగి ౧

---

ఎవ్వడా యోగి ?
ఎవ్వడా త్యాగి ?

ఆతడూదిన శంఖరవమున
అఖిల విశ్వము మేలుకొన్నది
అతడు చేసిన ధర్మబోధలు
అఖిల లోకము చూరగొన్నది

ఎవ్వడా యోగి ?
ఎవ్వడా త్యాగి ?

అవి భారతీయ ఋషివాటికలా ?
అవి వేదల హృత్పేటికలా ?
శ్రవణ పేయము లివ్వి
సామ గానములా ?
అవి యహింసా సత్య
నవ సుధా ధారలా ?

అదో___భారతీయ ముకుళిత కరమాల!
అదో___భారత జనకుని తపోగ్నికీల!

ఏమి యౌన్నత్యం—
అది హిమగిరి శిఖరమా ?
అది మహామహుని భావ ప్రకాశమా ?
ఏమి ప్రవాహం
అది పవిత్ర గంగాఝరమా ?
అది మహాత్ముని కరుణా భరమా ?

ఎవ్వడా యోగి ?
ఎవ్వడా త్యాగి ?

## హిమగిరీంద్రము – ౨

—

౧

పరమర్షి యాత్మలే
ప్రతిఫలించెడి నెచట ?
పరమపావన గంగ
ప్రవహించు నెచ్చోట ?
ప్రకృతి కై సేసికొని
పవళించు నెచ్చోట ?

ధ్యానింతు హిమగిరీం
ద్రము నెడద సంధించి,
ప్రేమింతు నమృత భాం
డము పెదవి కందించి.

౨

నిరుపమానందంబు
నిదుర మఱచిన దెచట ?
నిశ్చలత్వపు దీపి
నెఱుగదగు నెచ్చోట ?
శాంతిజీవన గీతి
స్రవియించు నెచ్చోట ?

ధ్యానింతు హిమగిరీం
ద్రము నెడద సంధించి,
ప్రేమింతు నమృత భాం
డము పెదవి కందించి.

3

ఏసానువుల నారయ
ప్రాసాదములు గట్టి
అప్సరఃకామినులు
హావభావము జిలుక
ఏతరుచ్ఛాయలకు
హృదయమే యర్పించి
యక్షభామిని విరహ
వేదనలు ప్రకటించు

ధ్యానింతు హిమగిరీం
ద్రము నెడద సంధించి,
ప్రేమింతు నమృత భాం
డము పెదవి కందించి.

౪

ఏకోనమూ్రోన్మగ
నెలుగెత్తి గంధర్వ
సుందరీ బృందంబు
సొగసు పాటలు జిలుకు?
ఏగుహాంతరసీమ
నెలనవ్వు దొలుకాడ
నెదల పయ్యెద జార
దేవకన్యలు నాట్య
దీధితులు వెలుగింత్రు ?

ధ్యానింతు హిమగిరీం
ద్రము నెషద సంధించి,
ప్రేమింతు నమృత భాం
డము పెదవి కందించి.

౫

ఏమనోజ్ఞ క్షేత్ర
భూమిలో విహరించి
ఎదురైన సుందరీ
మృదుల గండస్థలీ
మధుర ప్రేమాలాప
ములకు చేతులు మోడ్చి
ప్రవర మునివహ్ని దే
వ ప్రభావము నంది

ప్రబల నియమ వ్రతము
పండించె నెచ్చోట

ధ్యానింతు హిమగిరీం
ద్రము నెడద సంధించి,
ప్రేమింతు నమృత భాం
డము పెదవి కందించి.

౬

మార సంహార వి
స్ఫార నేత్రము విప్పి
పరమశివు డెచ్చోట
భయదాగ్ని శిఖలొలికె ?
కాళిదాసుడు పెద్ద
కథగట్టి కీర్తించె

ధ్యానింతు హిమగిరీం
ద్రము నెడద సంధించి,
ప్రేమింతు నమృత భాం
డము పెదవి కందించి.

## ఉషోదేవి ౩

౧

అమలమై లలితమై
సుమవల్లరీ నిచయ

రమణీయ కుంజముల
సుప్రభాత ప్రభలు
సోనలై విరబారె—

తరుశాఖికల మనో
హార కంఠముల నెత్తి
వేదసూక్తులువోలె
స్వాదు సుందరగీతి
వినిపించె విహగములు.

మలయ మారుతము, క
మ్మని సౌరభములతో
సద్యో జనిత కుసుమ
సంచయము విసరినది—

దివ్యసందేశార్థ
దీధితులు వెదజల్లె
కన్నుగవ చిరునగవు
కదలగ నుషఃకన్య

౨

ప్రేమ హృదయాంతరము
విచ్చిపారినయట్లు
తరణి కిరణ విభి న్న
సరణి, ముక్తాదామ
ములు వోలె మంచుశిల

కావ్యధారల పోల్కి
క్రమగతి విరిసినది—

కమనీయ విపిన భా
గములెల్ల పులకింప
శ్రవణ పేయముగాగ
ఝురులు నినదించినవి.

పర్ణశాలల నాత్మ
బంభరమ్ములు మొఱయు
ఉపనిషన్మంజు భా
వోద్వేగమున ఋషులు
కాల్యకరణీయ మ
గ్నత బొల్చి రెల్లెడల—

దివ్యసందేశార్థ
దీధితులు వెదజల్లె
కన్నుగవ లేనగవు
కదలగ నుషోదేవి

## కష్టజీవి ౪

౧

ప్రొద్దుప్రొద్దున పుడమిమన్ని
పొలము బెట్టీ ప్రోదిచేసీ
కపిలెదోలి కలుపు దీసి

కంచెగట్టీ కాపుచేసి
పంటచేతికి రాని బ్రదుకిది

కాలం
కలిసివస్తుందా
కష్టం
ఫలము చూస్తుందా ?

2

పసపు కుంకుమ పంచి పెట్టీ
భూమితల్లికి పూజసేసీ
కన్న బిడ్డల కావనెంచీ
కళ్ళుగాలే కలుకు బెంకల
పంటకోతకు పరువులెత్తే
ఇంటియాడుది యెంతపడినా
పొట్టనిండని పాడుబ్రతుకిది-

కాలం
కలిసివస్తుందా !
కష్టం
ఫలము తెస్తుందా !

3

వానదేవత కొలుకుకన్నులు
వాచిపోవగ నెదురుచూచీ
చేనిపంటకు చెలువుదెచ్చీ

చీడపుర్వుల చెయిదమరసీ
గడ్డిగాదము లేని గొడ్లను
కఱకుగా పస్తుండజేసీ
దేవుడై నను కన్నుదెరవని
తీరులకు జోహారుపట్టీ
బ్రదుక జాలక బ్రదుకుబ్రదుకిది-

కాలం
కలిసి వస్తుందా !
కష్టం
ఫలము నిస్తుందా !

౪

ఆకలె త్తిన యతిథిజూచీ
కంచమునగల కడియెగానీ
పంచిపెట్టే బాగుదెలిసీ
కాపురములో దాపురించే
రాపిడుల ననుభవము దెలిసీ,
పారలిపోయే బ్రదుకు తెరయిది-

కాలం
కలిసి వస్తుందా !
కష్టం
కనికరిస్తుందా !

౫

గింజ గిట్రి శూన్యములుగా
గాదె బుట్టల కడకు నెట్టే
కాపు కులమున పుట్టి పెరిగీ
పొరుగు పంచల తిరిపె మెత్తే
పద్ధతికి దూరంబె నడచీ !
పూట గడచీ పూట గడవక
పొరలి పోయే బ్రదుకు తెరువిది-

కాలం
కలిసి వస్తుందా !
కష్టం
ఫలము నిస్తుందా !

## గేయత్రయము ౫

౧

నా తలపు—
విశ్వ ప్రేమమయమైన
ఒకవల్లకీ తంత్రియుచ్చైస్స్వరంబుగా
పలుక నిమ్మోయి నాస్వామి !

నా పలుకు
విశ్వప్రాణి హితమైన
ఒక ప్రవాహంబులో నొకతరంగంబుగా
మలచి పోవోయి నాస్వామి !

౨

అవతరించితి తావ
కాజ్ఞానువర్తినై —
హర్మ్యసీమలనె యు
య్యాల లూగెదనంచు
పూలపాన్పులమీద
పొరలి యాడెద నంచు
సర్వమీలోకాన
సమకూరు ననుకొంటి

అవతరించితి తావ
కాజ్ఞాను వర్తినై —

నవ్వు వెన్నెల రేయి
నాకు స్వాగత మిచ్చె
పూవుదేనియ నేను
పోవు దారుల బారె
స్వర్గ మీ లోకాన
సమకూరె ననుకొంటి

అనుభవించితి తావ
కాజ్ఞానువర్తినై —

మధుమాస పికము మా
మావి తోపుల నిల్చి
మధుర గీతిక లెన్నొ
మాపు రేపుల వినిచె

అనుభవించితి తావ
కాజ్ఞానువర్తినై ——

అంతరింతును తావ
కాజ్ఞానువర్తినై ——
ప్రళయాభ్రి ఘోషంబు
పగిలించె కర్ణముల
విలయోగ్ర తమసంబు
వెలిపించె నేత్రముల,
కాలరాక్షసి నాదు
ప్రోలనెత్తురు గ్రక్క

అంతరింతును తావ
కాజ్ఞానువర్తినై
అవతరించితి తావ
కాజ్ఞానువర్తినై

చాల చిన్నదిరా! 3
నాయిల్లు
చాల చిన్నదిరా!
నామీది ప్రేమతో
నా వాకిటను నిల్చి
నన్ను బిల్తువుగాని
ఆతిథ్యమెటుసేతురా
నా బ్రదుకు
అంతటికి నోచదయ్యెనురా!

కారు మబ్బుల లోన
కటిక చీకటిలోన
నాస్వామి వగుసీవు
నాకొఱతనే తీర్ప
నా వాకిటను నిల్చి
నన్ను బిల్తువు గాని
చిన్నదివ్వెయు లేదురా
నీరాక
చిత్తమున వెతగూర్చురా!

మిత్రమై నాతోడ
మెలగి ముచ్చట లాడ
అరుదెంతువే గాని
చిఱుచాపయును లేదురా
కూర్చుండ
శిథిల భూభాగంబురా
కనుల నిండుగ నీరు
గ్రమ్ముకొన నీచెంత
పాటలే వినిపింతురా
నా బ్రతుకు
పాటతో పయనించురా.

## గీతాఫలము ౬

స్వార్థ భావావిలము ౧
పార్థ హృదయాంతరము

బంధు జన నిర్వాణ
పరితప్తమై, గ్రీష్మ
భయదాగ్నిమై కాగ

కటిక ఎండల శుష్క—
గిరి ఝరీ సదృశమై
నరుని హృదయాంతరము
పరియలై నై రాశ్య
భరితమై దిగజారె___

౨

కృష్ణ కాదంబినీ
కృతమనోహరనాద
మంతలోనని దోచె
నమృత సందేశమై

పురివిప్పి, నరహృదయ
వరమయూర నృత్య
సరణిలో దేలింది,

కృష్ణమేఘము కుంభ
వృష్టిగా కురిసింది,
నరుని హృదయాంకురము
నవనవోన్మేషమై
వలపు పందిరి నిండ
కళ లొలుక బోసింది

కృష్ణబోధా మృతము
గీతయై పండింది
పరమతత్త్వ మధురమ్ము
నరుని హృదయాంబుజము
ఫలము చూరాడింది !

# క ర్ష క ఋ తు వు లు ౭

౧

భావంబు చిగురింప
జీవితము కుసుమింప
పావన క్షేత్రమ్ము
త్రోవలోనీ యెడద——

ఎన్ని మధుమాసాల వన్నె లొలికించెనో
ఎలుగెత్తి కోకిలము లెన్నెన్ని పాడెనో

౨

తనువెల్ల చెమరింప
దినమెల్ల శ్రమియింప
అనుగునాగల బట్టి
అవనిదున్నె నీకు——

ఎన్ని గ్రీష్మర్తువులు హృదయమున దోచెనో
ఎన్ని యెండలుగాచి నిన్ను రాపాడెనో

3

పైరులే మెఱుపులై
పర్వమ్ము సంధింప
జీవనదులై పొంగి
భావములు ప్రవహింప—

ఎన్ని వర్షర్తువులు, యెడద దోతెంచెనో,
పొరలు మేఘాలెన్ని యుఱిమెనో నీ(మోల !

౪

శాలి ధాన్యము దెచ్చి
మోలిగాదెల బోసి
ఆలుబిడ్డల తోడ
లీలకాలము దోయ—

ఎన్ని శారదరాత్రు లెలమి చేకూర్చెనో,
ఎన్ని పున్నములు నీయింటనే దోచెనో!

౫

కఱవు కాటకముతో
వఱపు దోచిన నాడు
వడకు నీమనసులో
జడిమ దోచిన నాడు—

ఎన్ని హేమంతములు-ఎదుట పొడగట్టెనో
ఎన్ని హిమబిందువులు నిన్నావరించెనో!

౬

కూటి గింజలు లేమి
కుమిలి పొయ్యే వేళ
దారిద్ర్య దేవి నీ
తలుపు దట్టే వేళ—

ఎన్ని శిశిరర్తువులు ఎడద పొడసూపెనో
ఎండిరాలిన యాకు లెన్నియిల దాగెనో!

# శివదర్శనము లా

౧

అదిగో గిరి శిఖరంబు
అదిగో శివలింగంబు
ముదిగల్లు ప్రాంతాన
మొనయు కైలాసంబు

నిండుపున్నమ రేయి
పండు వెన్నెల తీపి
పరమ శివ దర్శనము
పాప విధ్వంసకము

౨

ఆకోన నీకోన
ఆకాశ గంగలై

అమృత సుఖదంబులై
అద్భుతములగు దోణాలు

అలజటా జూటమై
పలువరపు వృక్షముల్
ప్రకృతి సుందరలీల
పర్వినది గిరిశిఖరి

3

సర్ప ఫణముల వోలె
సాగి భీకరములై
గండశిల లొకకొన్ని
కనుపించు నీచరుల

అదిగో ! గిరిశిఖరంబు
అదిగో ! శివ లింగంబు
ముదిగల్లు ప్రాంతాన
మొనయు కైలాసంబు

4

సాంధ్య రాగచ్ఛటా
చ్ఛాయనొక పొదరిల్లు
పార్వతీ నియమ సం
పదవోలె వర్ధిల్లు

గిరి గుహాంతరములో
పొరలు నిశ్శబ్దంబు
ప్రమథ గణముల తపః
ప్రాభవంబుల బోలి

౫

అదిగో ! గిరిశిఖరంబు
అదిగో ! శివలింగంబు
ముదిగల్లు ప్రాంతాన
మొనయు కైలాసంబు

నిండుపున్నమ రేయి
పండువెన్నెల తీపి
పరమశివ దర్శనము
పాప విధ్వంసకము

# ధన్య జీవిత గాథ

వలపు మామిడికొమ్మ కలలొల్కబోసింది
పులకించి నాయెడద పొంగులై పారలింది
ఎలుగెత్తి కోకిలము తొలిపాట పాడింది
ప్రాతకాలమునాటి పాటకానేకాదు
పాటలో నేదియో పరమార్థమే తోచె
సందేశ గీతికా సరణిలో ధ్వనిసేసె—

అరువదేడుల ధన్యమైన జీవితగాథ !
మురిసిపోవుచు హృదయములు చెప్పుకొనుగాథ !

పరమకర్షకమూర్తి పండించు హర్షించు
వరిమళ్ళచాలులో పరిమళపు వాలులో
కలికి మిణ్గురుపుర్వు మిలమిలా మెఱసింది—

వెనుకనే గన్గొన్న వెల్గు కానేకాదు,
వెల్గులే వెల్గించు విమలతేజము తోచె
సందేశగీతికా సరణిలో ధ్వనిసేసె—

మురిసిపోవుచు హృదయములు చెప్పుకొనుగాథ
అరువదేడులు ధన్యమైన జీవితగాథ!

కటికు టెండలనెదిగి పెరటి పందిరితీవ
నిగ్గుతో విరిమల్లె నిండుగా పూచింది—
నేనెన్నడో కన్న నిగ్గు కానేకాదు
నేత్రముల కపూర్వ నిర్వాణముగ తోచె
సందేశగీతికా సరణిలో ధ్వనిసేసె—

అరువదేడుల ధన్యమైన జీవితగాథ
మురిసిపోవుచు హృదయములు చెప్పుకొనుగాథ!

కల్లూరివంశ సుమవల్లి సుబ్బారాయు
విపులదేశప్రేమ తపముగా పండింది
పూజ్యరాయలసీమ పూతమైపోయింది

ఎలుగెత్తి కోకిలము తొలిపాట పాడింది
కలికి మిణ్గురుపుర్వు మిలమిలామెటిసింది
నిగ్గుతో విరిమల్లె నిండారపూచింది
సందేశగీతికా సరణి వినిపించింది

మురిసిపోవుచు హృదయములు చెప్పికొను గాథ
అరువదేడుల ధన్యమైన జీవితగాథ!

# అందుకోలేను ౧౦

౧

వానచినుకుల చెలిమి
లోని యాశల కలిమి
ఒక్కమారే మనసు
నుఱ్ఱూత లూగించు

౨

సంభాషణల విషము
జార్చినటు లొక్కింత
స్వాదురాగామృతము
చల్లినటు లొకకొంత
ఒక్కమారే మనసు
నుఱ్ఱూత లూగించి

3

మన్నించి నటు కోర్కె
మలయానిలము వీచు
నిరసించినటు కోర్కె
నిర్ఝరము రోదసల్పు
ఒక్కమారే మనసు
నుఱ్ఱూత లూగించు

౪

విద్యుల్లతలు హృదయ
వీథినే ప్రేరేచు

మేఘ గర్జా రవము
మిథ్యయని యెదజీల్చు

వాన చిన్కుల చెలిమి
లోని యాశల కలిమి
ఒక్కమారే మనసు
నుత్పాత లూగించు

౫

ద్వైత భావములోన
తలపెల్ల మలినమై

అద్వైత మూర్తి, ని
న్నందుకో లేనయ్య!



# విషయసూచిక



# ఋతులక్ష్మి

## నవ్యసారథ్యము. ౧

మఱుగై పోయె విళంబి వత్సరము ; రమ్యంబైన సౌఖ్యంబులు
ర్వర బ్రాపింపమి నార్తి బొందెడి, ప్రజావర్గంబులే మూల నా
కరముల్ మోడ్చెద నో వికారి! సరగన్ గైకొమ్ము సారథ్యమున్
పరిపాలింపుము, ధర్మకేతనము శోభల్ గ్రక్క నభ్రంబునన్ 1

జనములు దమ్ముఁదా మెఱుఁగజాలమి, కాలము నిందసేసి స్వా
ర్థ, నిరతిలో మునుంగుచు, పరార్థ పరాఙ్ముఖులైరి; లోన స
ద్గుణ సుమవల్లరీచయము దోపగ జీవితముల్ వసంత భా
వన నలరించి యీ ప్రజల పాల వసింపుము నూతనాబ్దమా! 2

కారణ జన్మమెత్తితి వికారి! మహత్తర భంగి శాంతి తూ
ర్యారవ మల్లదే దెసల నాగకమ్రోగెడు, ప్రోత్సహింప వే
భారత యోధులన్ సుకృతభావ పరీవృతులన్ - మహోజ్జ్వల
ప్రేరణలందు, సద్విజయ రేఖలు దాగిన జాడ దెల్పుచున్. 3

## పూలమాల ౨

వలపించు ననంతాశ్రమ తలమునసంధ్యాప్రశాంత తరుణంబుల ను
జ్జ్వలగతి మౌనముదాల్చుట కలవడితిరి యోగిపుంగవా నిశ్చలతన్

గీతాప్రబోధ మాధురి లోతెలిగినశిష్యవితతిలో ప్రభవించెఁ
చేతశ్శాంతికిమార్గము ఆతత ధర్మైక్యకర క్రియాత్మజెలంగఁ
కన్నులుతడిసియై, హృదయోత్పన్నంబగుభక్తి దివ్యభాగీరథియై
నిన్నర్పించుట నాకొక పున్నెంబై యుగము క్షణముబోలుగురురాజ్!

ప్రేమానంద మనోహర కోమల సుమచయము భావగుచ్ఛంబేదో
భూమానందాకృతిగా సేమంబిడవచ్చె నమృతజీవన ఫణితిన్.

గౌతముడువచ్చి దీవింప గడగినట్లు
రామకృష్ణ పరమహంస రాకయట్లు
అన్నియును వివేకానందు డయినయట్లు
కలలు - తలపులు - నవ్య లోకములుస్వామి !

కనులఁదొంతరలైన లేసగవులాకర్షించి, యాధ్యాత్మిక
ప్రణయోపాసన మాకుదెల్పెదు, నమోవాకంబులో సాధుస
జ్జన సాంగత్యపునీతసుందరమతీ ! సాధింపగారానిసా
ధనలో సిద్ధులరై తిరీమనఁగడఁ ధన్యంబు గావించుచున్

ఓయతిచంద్ర ! మీకృషి ఫలోన్ముఖయై, సుజనప్రబోధసం
ధాయకమై, మనోజ్ఞ పరతత్త్వవిధాన విశాల వీధులఁ
తీయనతీయనై, హృదయదీప్తికి దోహదమై, రసార్ద్రమై
కోయిలపాటయై, యలముకొన్నది శాంతి పథానుగామియై

కనుగవ విప్పలేని కసుగందులమున్, నిరుపేదవారమున్
జనని విధాన మమ్మరసి జ్ఞాన ధనంబొనగూర్చు దాతయై
మనిచి, తమోవినీల గృహమధ్యమునన్ బడి తారులాడు జీ
వనులకు వెల్గుజూపి నిరపాయత నన్నలరింపరా ; గురూ !

స్వామి, యలౌకికప్రతిభపావనులై చరియించుమీకు, జ్ఞా
నామృతమారగ్రోలి హృదయస్థలి నాశ్రమ దివ్యవాటికా
శ్రీమలయానిలాంకుర విశేషసుఖంబుల నందు భారతీ
స్వాములు, మీకు మేమొసగ జాలిన దింతియ పూలమాలికల్.

## సంధ్యారవము ౩

తల్లుల బిలుచు వత్సముల యంబారవం
బరసి ధేనువులిచ్చు ప్రతిరవమ్ము

బారులుదీరి యంబరవీధి తమకులా
యముల కేగెడు విహంగారవమ్ము

పొలములయందు దవ్వులనున్న కర్షక
జనము లొండొరు బిల్చుకొనురవమ్ము

గిరి సానుతలముల నొరసి యేతెంచు ని
ర్ఝరిణి యవ్యక్త మర్మరరవమ్ము

గఁగల తరుశాఖికల శుష్కమగు పత్ర
తతి డుల్చుమంద మారుతరవమ్ము

కదుపులు మరలింప గడగు గొల్లలు వన్య
సీమ నెల్గించు వంశీరవమ్ము

ప్రసవించు కుసుమగర్భములందు మధుకరో
ద్గాత ప్రశాంత ఝుంకారరవమ్ము

ప్రియ విరహవ్యథోద్భిన్న మానస సుధా
తరళితప్రేమ గీతారవమ్ము
ధ్యానైక పరవశత్వమునందు కొనుయోగి
యెలుగెత్తి పరమేశు బిలుచురవము
శ్రవణ కఠోర నిరంతర స్వనిత ఘో
రారణ్యవిధి ఝిల్లీరవమ్ము
భగ్ననిద్రాన్విత స్వప్నజన్య పికార్భ
క ప్రేమ మాధురీ గళరవమ్ము
హృదయద్రవీభూత మృదుల మోహనభావ
లీలాంకురిత కురరీరవమ్ము

తత్త్వమునమేలుకొల్పి సౌందర్యభావ
గతులు గీల్కొల్పి శాశ్వత స్థితినిదెల్పి
వలయు పరమార్థములనెల్ల వెలువరించె
తప్త హృదయాంతరమున సంధ్యారవమ్ము

## మనోహర శిశుమూర్తి ౪

౧

ఆమహాయోగి — మాతృ గర్భాంతరమ్ము
వెలువడిననాడు — లక్షకోయిలలు కంఠ
మెత్తి యేకముఖాన — నందించెనేమొ
ఆమహాత్యాగి — మాతృగర్భాంతరమ్ము
వెలువడిననాడు — ఒకకోటిసెలలుకలయ

మొరసి ప్రవహించెనేమొ — సమ్మగ్ధులగుచు
వినిన సుకృతాత్ములెవరు — తద్విమల రవము !
పడసి కనుమూయ నున్న దౌర్భాగ్యురాలు
మాతృమూర్తి మాయాదేవి మనసుదక్క—

౨

అల ప్రజాపాలనమునకు నవతరించి
తన తపఃఫలమైనసంతతియె లేమి
కుమిలి పోయిన హృదయంబు — కుసుమ సదృశ
మగుచు గాఢవాత్సల్య రసార్ద్రమైన
అల్ల శుద్ధోధనుని హృదయంబుదక్క,—
అది మనోహర శిశుమూర్తి యగుటకాదు
జగదతీతంబు విశ్వవిశ్వాత్మకంబు
అది మహత్తర మధుర శోభావృతంబు
అల జగద్గురు రూపమటంచు కొంత
తత్త్వమెఱిఁగిన మునుల డెందములుదక్క—
వినిన పుణ్యాత్ములెవరు తద్విమల రవము !

# ప్రకృతిమాతకు దీవెనపూలు

లేఁతవయస్సునందు దెమలించిన కార్యకలాప వైఖరుల్
ప్రీతిఘటింప, వీణె సవరించి మనోహర నవ్యగీతికా
పూత రసార్ద్రభావముల పొంతల నిన్ను నుతింతు — సాహితీ
రీతుల నల్లనల్ల నలరించితి, వార్యవిశేషధర్మ లీ

లాతిశయంబులెల్ల ప్రియమారఁగఁ దెల్పితి, నెట్టు లర్భక
వ్రాతము సద్వికాసమున వర్ధిలు తత్తదనూనమార్గముల్
చేతము లుల్లసిల్ల ప్రవచించితి, భారత ధర్మగేహినీ
నీతి విధానమెల్ల కమనీయ వచోరచనానుభూతి వి
ఖ్యాతమొనర్చి తెన్నిసమయంబులఁ జెప్పితి యోగ సాధనా
జ్ఞాతరహస్యమెల్ల, సరసంబగు వైదిక దివ్యసూత్ర సం
గీతములోనఁ దెల్పితి, ప్రకీర్ణములెన్ని లసత్ప్రసంగముల్
పూతలు పూచె నీయెడఁద పొంగులలో స్తవనీయ పత్రికా
మాత! త్వదీయ జీవిత సమాకృతులై సువధూతగారు నీ
కాతత శోభఁగూర్చ శుభమారయ శిఃపి యాంజనేయు ప్ర
జ్ఞాతరుణారుణప్రభలు జాల్కొన, దీవెనపూలు చల్లి ప్ర
ఖ్యాత కవీశ్వరుల్ బుధు లఖండ ముదంబున నిన్నుఁ బెంపఁగా
కౌతుకలీల దేలెదవు కమ్మని జన్మ దినోత్సవంబులు
ఊఁతల నూప నీహృదయ ముత్తమ సాధనకై జనించి యీ
భాతిగ సర్వకాలము తపశ్చరణంబున నుద్యమించి ని
ర్ధూత సమస్త కల్మషుల తోడయి రమ్మ ప్రజానురక్తితోఁ

# కవితా నైవేద్యము ౬

నన్నయకైతలో నొదుగు నాదము తిక్కన వాక్కులందు భా
వోన్నతి శంభుదాసుని సముజ్జ్వలసూక్తి విధాన; మెల్లనీ
కున్నదటంచు నిన్ బొగడి యున్నత పీఠమునందు గౌరవా
భ్యున్నతి రెడ్డిరాజు కడు పూజలొనర్చె నిరుపమహాకవీ! 1

కస్తూరీ ఘనసార సౌరభములన్ గల్పించి, తాంబూల వి
న్యస్త స్వర్ణ మనోజ్ఞ టంకములు నీకర్పించి కర్ణాటపుం
గోస్తాలో నొకదివ్యవైభవమునన్ గొండాడి పూజించి నీ
నిస్తంద్ర ప్రతిభావిశేషముల నెన్నే దిక్కులన్ జల్లిరో! 2

నిను కవిసార్వభౌముఁడని నెమ్మది పొంగెదకాని నాడు పో
తన కవిచంద్రుఁ డాకలికి తాళి వనంబుల కందమూలముల్
గొని భుజియించి లేమిబడి క్రుంగుట కన్నులఁజూచిచూచి నీ
మనము ద్రవించియున్న యిఁకమాటలు లేవు రచించి చెప్పఁగన్! 3

కాశీఖండ మహాప్రబంధము రసోద్గారంబుగాదీర్చి యా
వేశస్ఫూర్తిని పొంగిపోయితివి- నీవిద్యావిశేషంబు లే
రాశింబోసితి వట్టిపోకడ ప్రజా రాశిక్సముప్పొంగునే
ప్రాశస్త్యంబని, కాలకల్పితముగా భావింతు కావ్యావళిన్! 4

సేవించున్ మహదాంధ్ర సీమయె నినున్ శ్రీనాథ వర్ధంతులా
యావేళన్ బుధరంజకంబగు నుపన్యాసంబులన్ బేర్చు గో
దావర్యాపగ కృష్ణతుంగలు మహోదాత్తమ్ములై ప్రాచ్యపుం
త్రోవల్ సెప్పు తరంగరావము బడిన్ శ్రోతల్ ప్రమోదింపగన్ 5

చిరకాలంబు జగంబు లూపుచు యశశ్శ్రీ నీకు గల్పించు సుం
దరకావ్యంబొక నైషధంబెకద తాదాత్మ్యంబు నీకబ్బెనే-
గఱులన్విచ్చి సభోంతరాళములలో గై సేయు నీ హంసి, నే
మఱజాలన్ దమయంతి మంజుల వచోమాధుర్య లీలాగతుల్! 6

అల పలనాటి వీర చరితావళులన్ ద్విపదల్ గ్రహించి ని
ర్మల కవితాప్రసూనములు రాల్చితివంచు జనంబుమెచ్చు, నీ
లలిత సమాస గుంఫన కళానియమంబులు లేమిజూచి యు
జ్జ్వలమతులైన కొందఱికి సంశయమే పొడగట్టె చిత్రమై! 7

చారుతరంబు శిష్టజన సమ్మతమైనది, కాళిదాస శృం
గారములోన తన్మయత గాంచెడి మాదృశులందు నంగశృం
గారముజెప్పు నీరచనగన్గొని ప్రీత్యయమంతలేదు, కా
నీ, రమణీయధార యొక నిర్ఝరమై ప్రవహించు నందునన్

హారలీలాది మహాకృతుల్ నుడివి విద్యాశాఖలన్ పెద్దవై
పోరి విద్వత్ సభ గౌడడిండిమునితో పోరాడ, నీకీర్తి మం
దిరసీమన్ విజయధ్వజంబెగిరె కానీ కావ్యనిర్మాణ వై
ఖరిలో నెందు స్వతంత్రభావములు మృగ్యంబయ్యె; నేహేతువో!

రసిక వతంసమై బ్రదికి ప్రాియపు చేతుల కొంపవీటి రె
డ్డిసభల చాటుగీతి ప్రకటించితి - కన్నెనెలంత గుబ్బల
బ్బెసమొనరించు ఛాయనెటు పెంచితి వీశ్వరభక్తి భావమున్
విసమునవే సుధాద్రవము పీల్చుట పూర్వమహర్షి మార్గమో? 9

వీణాతంత్రులు భక్తి భావమున నుద్వేగంబులై పల్కగా
నానాదిక్కులలో ధ్వనించి పలిచెన్ మప్పింపు మస్మద్వచ
శ్శ్రీ నై శిత్యము, చూడజాలమిలలో శ్రీనాథ, స్వర్ణాభిషే
కానూనంబగు నాటివై భవ సమగ్రత్వంబు లేనాటికిన్ 10

కవితాక్షేత్రములన్ కృషీవలుడ వై గర్పించి, వృద్ధాప్యమం
దవలోకించు నభాగ్యదేవతకులోనై తెల్లికర్గాట ల
క్ష్మివళంబై చను నీవుగద్దనిక నేకీభావముగా గాంతు నీ
నవసారస్వత మాంధ్రభారతి కడన్ నైవేద్యమర్పించుచున్ 11

# ప్రత్యుత్తరము

నన్ను నేడ్పింప జూచు చున్నాడు స్వామి
నన్ను నవ్వించు బ్రతుకు మన్నది జగంబు,
ఏడ్పులో నవ్వు, నవ్వులో నేడ్పు జూచి
క్రొత్త దారుల జనుట — ప్రత్యుత్తరమ్ము!

నాకు విషపాత్ర జూపు చున్నాడు స్వామి
నాకు సుధవోసి బ్రోవు మన్నది జగంబు,
విషములోసుధ, సుధలోన విషము జూచి
క్రొత్త దారుల జనుట — ప్రత్యుత్తరమ్ము!

నన్ను చీకటి గది జేర్చినాడు స్వామి
నన్ను వెన్నెల కీడ్చు చున్నది జగంబు
తమములో జ్యోత్స్న, జ్యోత్స్నలో తమము జూచి
క్రొత్తదారులు జనుట — ప్రత్యుత్తరమ్ము!

# మాగాడిచెర్లా

వర సారస్వత వీథులన్ తొలుత సేవారక్తి మేలొంటి, వి
త్తటి గ్రంథాలయ కార్య సంతతి సముత్సాహంబె యామీాద నా

దరముఁ జూపితివో వయోజనుల విద్యాభ్యాస మందంతలో
వారిసర్వోత్తమ రాయ; మీకృషి ఫలంబై రాలె; మాచెంగటన్

ఉష్ణ రక్తమున భావోల్బణంబగువాడు
తీవరించితి ప్రాంత దేశ భక్తి
అల సభాంగణపు గద్దెలపై నివాసించి
గర్జించితి వనల్ప కార్యసరణి
ఆంధ్రపత్రికకు కరావలంబన మిచ్చి
ఆరజల్లితి వుదారాశయముల
ఉభయభాషల సొంపు లొలుక బోయుచు కృతుల్
సంతరించితి సర్వ జనహితముగ

ఓరసికమూర్తి! ఏవి సర్వోత్తమములు ?
ఏవిసర్వోత్తమంబులుగావు పనులు ?
నీకు సర్వోత్తమాభిద నిచ్చి పిల్చు
తల్లిదండ్రుల మదులు రంజిల్లుగాక !

ఒక దేవాలయ సన్నిభంబయి పవిత్రోదాత్తపుందోవ పా
యక గ్రంథాలయ మొక్కడే నడుపు, నీయర్థం బుపాసింపగా
నకలంకంబగు మీ తపోనియతి గోప్యంబెల్ల సర్వోత్తమా
ర్వా కళారీతులు తాండవించు జగతిన్ హర్షంబు చేకూర్చుచున్

# సెలకన్నె

ఓ సెలకన్నె నీకొటుల మోగినిపోలె నరణ్య వాటికా
వాసమునన్ ప్రశాంతిమయ పావన జీవనముల్ చరింతు, లీ

లాసుకుమార మంజుల గళమ్ముల నెత్తి శకుంత సంతతుల్
భాసుర వేద ఘోషల వెలార్పగ నొక్కట తీర భూములన్ 1

నీ సౌందర్యములో పరాత్పరుని సందేశంబులన్ దాచి త
ద్భాసంగంబున పోత్సహించెద వనిర్వాచ్యంబు నీప్రేమ నీ
పై సంధ్యాద్రిసమాగమ ద్యుతులు ప్రోవై పార్వతీ దివ్య దీ
ప్తాసంశోభితవౌదు మాయెడదలన్ సాత్పోత్కృతిన్ జెందుచున్ 2

ఈ మృదులానిలంబుల చలించు త్వదూర్మికలందు తాండవ
శ్రీ మధురానుభూతి యలరించెద, రమ్య కళానుషంగివై
మైమరపొంది జూచి శశి మాళివలెన్ గిరినిర్ఝరంబు! జ్యో
త్స్నామలమూర్తియైన హిమ ధాముని ఛాయలు బర్వె నీపయిన్

నీ యెలపాటలో కరగి నిల్వలి ఈజడవస్తు జాతముల్
నీ యమృతస్వరంబు సరణిన్ కలియంబడి గాన మాధురిన్
పావన మయ్యె, నేక ముఖమై హృద యార్పణ సల్పి ఈశ్వర
ధ్యేయము గాంచు ప్రాణుల గతిన్ పరమార్థము వెల్వరించుచున్ 4

త్యాగధనంబు గాచి కొను తాపసవర్గము నీదు సన్నిధిన్
మూగి త్రిసంధ్యకాలముల మ్రొక్కరిలున్ సుకృతాత్మవంచు స్వ
చ్ఛాగతినంది యీప్రకృతి చారుతకున్ కయిసేత లిచ్చు ని
న్నో గిరిబాల! ప్రేమమయ ఉత్సుకతన్ గనికొల్తు రాత్మలన్ 5

## ఋతు లక్ష్మి ౧౦

శీర్షంబందున్ చలిది నునిచెన్ క్షేత్రమార్గంబుపట్టెన్
వర్ష ప్రాయంబు నిసుగెడదన్ వల్కలంబందు పొంగన్

హర్షంబయ్యెఁ హాలిక తరుణీ హావ భావైక లీలఁ
వర్షాకాలం బమృత మధుర వ్యాప్తి చేతమ్ము దన్పఁ 1

శ్రేణుల్ గట్టుఁ జదల బఱచుఁ జేయు నేత్రోత్సవంబుల్
నానా భావస్ఫురణ బకముల్ ; నాచు హృత్సీమనెల్లఁ
ద్యోనాదంబుల్ పరవశగతిఁ దోచు నభ్రమ్ము లేగఁ
ఆనందోర్విఁ నిఖిల జగమోలార్ప కేదారమాలల్ 2

శైలాగ్రంబుల్ బిలబిల రవ శ్రావ్యగాథల్ నచించున్
జాలై పొర్లన్ సలలిత ఝురుల్ సానుదేశంబు లందున్
వాలున్ గొమ్మల్ విపిన తటులఁ వానజల్లుల్ విదల్పఁ
ఆలోకించుఁ రసిక హృదయం బార్ద్ర కాలాగమంబున్ 3

ఏదో దేశం బరగిన ప్రియుం డింక స్వస్థానమేగఁ
క్రిందా కార్య ప్రచయ ముడిగెన్ కాంతు లుజ్జూతలూపన్
సందోహంబుల్ జలదములు తచ్ఛాయ వర్షించి పోవఁ
మందాక్రాంత బగుచు పాలిచెఁ మానినీ ప్రేమతీవెల్ 4

## కవితాశబల ౧౧

పొదుగుల్ నిండి సమగ్రరోచుల పయఃపూరమ్ము లాంధ్రోర్వికిఁ
బిదుకంగాగల సాధువీ శబల సంప్రీతిన్ గృహ ప్రాంగణం
బిచి చేరంగని పూజసల్పినవి నాయిల్లాలు తొల్దొల్త ప్రే
మవృగంత స్ఫురితప్రసూనములు సొంపారఁ ఖురశ్రేణుల్

మీ కవితా సుమ మంజరిపై కొనివిసరెన్ ప్రశాంతపవనాంకురముల్
మా కవి సామ్రాట్టులశోభాకలిత రసార్ద్రమధురవాఙ్నిచయంబుల్
అభిమానమునాపై గొనిఅభినవతిక్కన! త్వదీయమగుకృతులనుపన్
ఉభయులును దన్పిమైత్రీవిభవ శరీమశయమునభము విరియన్ బ్రాకెన్

మేసెనా వర్ష ధారా సముజ్జ్వలమైన
నవతృణాంకురములనందు శబల
పిదికెనా, అమృత సంపదల రుచ్యములైన
క్షీర ధారల నందజేయు శబల
చేరెనా చనువిచ్చి శిశువుల యెడ ప్రేమ
మిళిత లాంఛనముల మెలగు శబల
విహరించెనా, స్వైరవీధుల బడి క్షేత్ర
భూముల విహరింప బోవు శబల

కమ్మ కమ్మని యెసద నైక్యమ్మొనర్చి
మీరు పెంచిన శబల యీ భారతీయ
ధర్మ సారము గురియుచు ధన్యమయ్యె
కాపుదలమీద తుమ్మల కవివరేణ్య!

అంతములేనిరక్తి హృదయంబున మెచ్చుచు విశ్వనాథ సం
క్రాంతి తలంపు పేర్కొనియె కాదనరాదిది కర్షకుండవై
యెంత శ్రమించినావో తొలియేడల, నీకలమే హలంబు, మా
పొంతల సాహితీ లలిత భూములు దున్నెదు పైరు నాటుచున్

యాతాయాతాధ్వగ జనమనోహారి పానీయశాలా
ఖ్యాతిన్ నిల్పెన్ లలితగతులన్ కావ్యఖండంబు లందున్

వాతోద్ధూత ప్రసవచయముల్ వంగి వర్షించు మేఘు
వాత్రితంబయ్యెన్ వివిధగుణ సంక్రాంతముల్ కావ్యమాలల్

ప్రాతస్సంధ్యల్ సరసకవితా స్వాదు దుగ్ధమ్ములింటన్
చేతఃప్రీతిన్ గొలిపి పిదుకన్ సేవ గావింతు రేనిన్
పూతంబయ్యెఁ జగతి శబలా పూజ్య భావంబులొసన్
సీతారామా, కవివర యశశ్శ్రీలు నిన్నుఁ గావరించెన్

# అర్జుని కృతజ్ఞత ౧_౨

పాత్రమెఱింగి నాహృదయ భారమెఱింగి నిరంతరంబు రా
పత్రయ వార్ధివీచికల బ్రాకెడునన్ను _ సమాయకుఁ మహో
యాత్రియొనర్ప సర్వ పథ మూరియ జాలని నన్న సీకరు
క్షేత్ర పవిత్ర భూమి బ్రతికించితి నీవొక నావగా ప్రభూ !

మిత్రమవీవు నాయెడద క్రింగెడి శోకభరంబు నీవ్వ నే
సూత్రము బన్ని నావొ ! పరిశుద్ధ మనస్కుఁడ నైతి మన్మనో
నేత్రము లారవిప్పి యతి నిర్మల మూర్తి నెఱింగితిఁ గురు
క్షేత్రి పవిత్ర భూమి ప్రవచించితి కృష్ణ ! రహస్య మంతయుఁ

చిత్రము నీస్వరూప మతిచిత్రము తావకవిశ్వరూప మీ
ధాత్రివి నీవె _ నీమధురదర్శనమే గగనంబునందు _ చా
రిత్రము తావకీన మవలీల నెఱుంగగ రానిదీ కురు
క్షేత్ర పవిత్రభూమి విరచించెద నేను కృతజ్ఞ తాంజలిఁ

# వరూధినీప్రవరము ౧౩

స్మేరాలోకప్రసవము, త్రపాస్నిగ్ధ సౌరభ్య మొల్కఁ
తారుణ్యశ్రీ తనులత నవోద్యాన మాధుర్యమొప్పఁ
పారమ్యంబై ప్రణయ మమృతప్రాయమై వాకగట్టన్
ఆరాధించెన్ ప్రవరుని గిరిప్రాంత కాంతార భూమిన్ 1

వీణాతంత్రిల్ మొరయగ శిలావేది లేమావి పొంతన్
నానాభంగిమన్ రసములొలికెన్ కాంతా గాంధర్వవీథిన్
లోనుప్పొంగఁ అతడు సుఖియై లోకవాంఛల్ త్యజించున్
ధీనై పుణ్యం బడరగ, తపోదీక్షలో నైక్యమొందున్ 2

కందర్పార్తిన్ వివశమగుచున్ కామినీ భావమెల్లన్
మందాక్రాంతం బగుచు నిలుచున్ మాటికిన్ విప్రునందున్
సందెల్ మీరఁ నిజ గృహకథాసక్తుఁడా శ్రోత్రియుండున్
మందాక్రాంతం బగును తలపుల్ మంజు హోమక్రియాళిన్ 3

పూవుందీవెల్ పరివిమల ఝరీపుంజముల్ కందరంబుల్
తావుల్ సౌఖ్యప్రదము లనుచున్ తన్వి పేరాస గొల్పన్
పూవుందీవెల్ ప్రవిమల ఝరీ పుంజముల్ కందరంబుల్
తావుల్ శాంతిప్రదము లనుచున్ తాపసుం డాత్మమెచ్చున్ 4

ఏకాంతంబై దివిజ వనితా హేమ రాగాంకురంబుల్
సోకఁ, గంగా సలిలములలో రుద్ధుఁడై సైకతోర్విన్

ప్రాకన్ భక్తి ప్రచయమతఁడున్ వహ్నిదేవుఁ నుతించెఁ
రాకాచంద్ర ప్రభల తమముల్ రాలవే శూన్య వీథిఁ 5

తేనెల్ చిందఁ పలికి వఱలో దించు నావన్నెలాడిఁ
తేనెల్ చిందఁ పలికి తలపుల్ ద్రిప్పు నావైదికుండుఁ
నానా దుఃఖప్రకృతి జగతీ నాటకాంకంబు త్రోవఁ
జ్ఞానానందాలయము లలిత స్థాన మెంతేని దవ్వో! 6

# శివానందసరస్వతి ౧౪

---

నందడి సేసె నీమధుర సంయమ నమ్ము లమోఘ లీల హృ
న్మందిరమందు, నిన్ను నయనమ్ముల తృప్తిగ జూడగల్గు భా
గ్యేందిర దాపురించు టది యెన్నడొ? యెన్నడొ? స్వామిశ్రీశివా
నంద సరస్వతీ! తెరువునఁ నడిపింపు పిపాస దీరగఁ 1

అందదు నాప్రభూ! విపుల యాతనలఁ కృశియించు నాకు నీ
యందపుదీప్తి, రమ్ము భవదాశ్రమ సీమకు జేర్చుకొమ్ము, నా
డెందములో రహస్యము ముడిఁ విడదీయుచు నీదు సూక్తులే
చిందము వోలె మ్రోసితిని జీవిత శాంతికి నాందిపల్కులఁ 2

కొందఱి కాత్మబోధ, మఱి కొందఱికిఁ ప్రకృతీ సుబోధముల్
కొందఱికిఁ మనోజ్ఞ రసగుంభన సాహితి, గూర్చి నిర్మలా
నంద పవిత్ర గంగ మలినమ్ముల ద్రోయుచు స్వామిజీ! శివా
నందగురుత్తమా! యొదల నాటితి వందఱి కన్ని యోగముల్ 3

మందిర మయ్యెడిన్ ప్రకృతిమాతకు నా హిమవన్నగంబులో
కందర భూమిలో తపము గైకొను యోగివి, దివ్య సాధనల్
చెందిన నీమనోనియమ శీలతకున్ పరిణమిల్లుదున్ శివా
నందసరస్వతీ! లలిత నామము సార్థకమయ్యె నీయెడన్ 4

వందనముల్ ఘొనర్తు; ప్రతిభా రమణీయము నీదు మూర్తికిన్
పొందనిదేది? నీయమృత పూరిత భావనలోన స్వామి! నీ
కెందఱు శిష్యులయ్యె? వచి యింపుము! తన్మదు పాద ధూళికై
కొందు; మదీయ శీర్షమున కోరికమై నిడికొందు; నిత్యమున్ 5

## నరనారాయణులు ౧౫

నరుఁ డజ్ఞాన పయోనిధి
తరగలలో మున్కలెత్త తటిగని గీతా
వరనౌక కృష్ణ నావికుఁ
డరుదుగ దరిజేర్చె నతని యాత్మ చెలంగన్ 1

నర హృదయ వనము చింతా
భర దవ దహనంబు రేగి పరిగొన గీతా
సురుచిర ధారల కృష్ణో
ద్దురు మేఘము కురిసి యతని తొందర మాన్పెన్ 2

నరుఁడు నిరాశావృత విష
భరితంబగు పాత్ర పెదవి బట్టగ గీతా
స్ఫురితామృతంబు గ్రోలిచి
హరి వైద్యుఁడు వోలె కాచె నతనిన్ ప్రీతిన్ 3

నరుఁడత్యంత విషాదము
తెర క్రమ్మడి చీకటింటఁ దిరుగగ గీతా
పరమాద్భుత తేజంబున
పరమాత్ముఁడు దోచె దివ్వె వలె నాతనికిన్ 4

నరుఁడొకట స్వార్థ జీవన
పరిణతి మరుభూములందు బడిపో గీతా
నిరుపమ మార్గము నందిడి
పరముఁడు పానీయ శాల వైఖరి నిలిచెన్ 5

## అక్షమాలిక ౧౬

---

౧

స్వామి భూమానంద సంయమీంద్రులకు
ప్రేమ పూర్వక నమస్కృతి సహస్రములు
వేదాంత సహకార విమల శాఖికల
స్వాదు గీతీ పిక స్వామి భారతికి
హృదయ పూర్వక నమస్కృతి సహస్రములు
సదమల జ్ఞాన భిక్షా వదాన్యులకు
వినయ పూర్వక భావ విస్మృతాంజలులు
ఘనతర సన్మాన కార్య దీప్తములు
ప్రేమ పూర్వక నమస్కృతి సహస్రములు
స్వామి భూమానంద సంయమీంద్రులకు

౨

తన బంధుమిత్రుల తన గురూత్తముల
కనుఁగొని భయద సంగ్రామరంగమున
గాండివంబును జార్చి కన్నీరు చేర్చి
భండనం బొల్లని పార్థుని జూచి
ఏయోగముల కృష్ణుఁడెంతేని తెల్పె
నా యోగమార్గము లన్నియు తఱచి
జిజ్ఞాసువులకెల్ల చెప్పి బోధించి
ప్రజ్ఞావిశేషంబు పండించి వైచె;
హాలిక జీవన మనంతాశ్రమ క్షేత్ర
ముల భారతీ యోగ పుంగవుండండె;
స్వామి భూమానంద సంయమీంద్రులకు
ప్రేమ పూర్వక నమస్కృతి సహస్రములు.

౩

ఉపనిషదముల భావోజ్జ్వల వీథి
తపియించి వ్యాఖ్యాన తతి సంతరించి
మౌన దీక్షా సుధా మంజు మార్గమున
ధ్యానించి హృదయ శాంతత సేకరించి,
తనివోని వాచాలతా విశేషమున
విని వారి వీనుల విందు గావించి,
నిరుపమానంద సన్నిధి నోలలాడి
నిరుపమానంద సన్నిధి నోలలార్చె;
భక్తి పూర్వక నమః ప్రణవ నాదములు
శక్తి పురస్కృత సన్మాన విధులు.

౪

భస్మావజాత శోభలు లలాటమున
సుస్మేర రోచిస్సు సుందరాస్యమున
కాషాయ వసన సంగతి శరీరమున
భాషావధూటి దివ్య రసనాగ్రమున
ధర్మవర్తనము తత్త్వైక భావమున
భాసింప నిరుపమ ప్రాచ్య సంస్కార
మే సామి దర్శనంబిచ్చు శిష్యులకు
స్వామి భూమానంద సంయమీంద్రులకు
ప్రేమ పూర్వక నమస్కృతి సహస్రములు.

౫

కృష్ణ బోధామృతోత్కృష్ట గీతమున
తృష్ణ యెల్లెడల వర్ధిల్లును గాత!
ఆకర్మ నిష్ఠ హృదంతరంగమున
పాత్రికి ఫలాపేక్ష వదలించు గాత
స్వామి భూమానంద సౌజన్య నిధికి
ఆముష్మిక ఫలంబు లబ్బును గాక
బెళ్ళూరి మధుర కవీంద్రుని వాణి
యెల్లెడ సౌరభం బెసగించు గాక

## అమృతాభిషేకము ౧౨

సంస్కృతాంధ్ర మనోజ్ఞ సారస్వత రసాల
రాజ పూ. వి. స. వి. మారాళ్ళపల్లి

లలిత గాంధర్వ కళావేది కోకిల
రాణి పాడినది మారాళ్ళపల్లి
నవరసానంద తన్మయలీల వనలక్ష్మి
యల్ల సవ్వినది మారాళ్ళపల్లి
కమ్మకమ్మని తెల్గు కవితల తొలివాన
జల్లులాడినది మారాళ్ళపల్లి

రమ్య మధుమాస వాసరారంభదిశల
నెల్ల కై సేసి కొన్నది రాళ్ళపల్లి
ఈ యనంత సౌభాగ్యమే కృష్ణ తుంగ
గౌతమీ పెన్న తెలుగెత్తు గానరవము

నిను నీసీమకు పిల్వ బంచితిమిగానీ యేమి సన్మాన మీ
కనులన్ రాలెడు మోద బాష్పములు నీకై రత్నహారంబు గ్రు
నిసి హృత్పేటిక దాచికొమ్మ వలతేనిన్ సర్వ కాలంబులన్
దెసివారన్ వెలదీసి వాడుకొనుమన్నా! కృష్ణశర్మాభిధా!

వేమన్న యూట వెలందిని
చేమంతుల పూజసేయు చేతలు గాదా?
శ్రీ మాధుర్యము తెల్గుల
కామెత లిడు చేతలెల్ల నమృత జ్యోత్స్నల్

ఊరి వెలుపలి వటవృక్ష మొకటి వీధి
పాల గొంపోవు గొల్లెత పానశాల
పథిక సౌకర్య మొసగూర్చు పల్లె యువతి
వివిధ వస్తువుల్ ప్రాకృత కవిత లందు

ఒక్క ప్రాకృత గాథలో నొదిగిపోయె
శత సహస్ర ప్రబంధ సంతతి ; గభీర
జలధుల, నమూల్య రత్న సంచయము గలదు
సృష్టి శోధింప దగినది కృష్ణశర్మ

అల సారస్వత భూమి దున్నితివి సస్యంబై ప్రవర్ధిల్లె ని
ర్మల కావ్యప్రచయంబు పక్షి తతులన్ రానీక పశ్వాదులన్
పొలిమేరన్ దరియంగనీక పెను కాపుంబోలె ముప్రొద్దు మం
చెలపై నెక్కితి - కర్షక ప్రకృతి పూచెన్ రాళ్ళపల్లీయులన్

మును త్యాగయ్య కళాతపస్సునకు సమ్ముగ్ధుండవై యందు స
ధన గావించితి సిద్ధిబొందితివి పూతంబయ్యె నీమంజు వ
ర్తన,హృత్తంత్రి గదల్చి యీయదన తాదాత్మ్యంబుగల్పింపు మొ
క్క నిమేషంబు తరించి పోయెదము వాగర్థ ప్రమోదంబునన్

పరిపూర్ణ ప్రతిభా ప్రభాత మృదు శోభల్ నించి యాంధ్రోర్వియే
పరమార్థం బుపదేశమార్గములలో పాడించితో సాహితీ
గురుదేవుండని శిష్యవర్గములు నీకుం జోతలర్పించు ; సుం
దర మందారము పూచె వారి హృదయోద్యానంపు లోత్రోవలన్

అమల హృత్పాత్రికలను ప్రేమామృతంబు
నించి, యభిషేక మొనరింప నీజగత్తు
నీ మహోజ్వల గీతి విన్పింప గంటి
నీమహత్తర తపము పండించుకొంటి.

ఓం శాంతిశ్శాంతిః.

---

హిందూపురం శ్రీ విష్ణు ప్రింటర్సునందు ముద్రింపబడినది.

# 'భక్తమందారము'పై అభిప్రాయము



శా॥ సందేశంబిది! శాసనంబయిది! శాస్త్రంబిద్ది! లోకంబిదే!!
సౌందర్యాత్మ్యము! సత్యసమ్మతము! విశ్వశ్రేయ, మీభక్తస
న్మాందరమ్ము!! గ్రహించికూర్చితిరి నానావాసనల్ పేర్చి;మీ
మందారప్రతి పద్య,పాద, పదమున్ మాధుర్య పీయూషమున్

జిందున్ షట్పదమట్ల తన్మధువు, మచ్చిత్తంబు సేవించుచున్
జిందుల్ త్రొక్కె! అహోబలార్య! కవితాశిల్పాఢ్య!
కల్లూరు వం
శ్యేందూ! శ్రీ'కవిభూషణా' నమః-సుక్షేమంబిందుకల్గొడునన్
బంధూ! నేఁ"గవిరాజు"ఁ గొందుసెల! వశ్వత్థాఖ్యుఁడన్
—గందువో!

మీ—క—అశ్వత్థరావు
5—10—58



# గ్రంథకర్తలకు సూచనలు

1. గ్రంథకర్తలు సాధ్యమైనంతవరకు రాయలసీమ వారుగ నుండవలయును. గ్రంథమాల నియమములకులోబడి క్రౌను సైజు 100 పేజీల లోపలనే యిముడునట్లు పుస్తకము లుండవలెను. శుద్ధప్రతి వ్రాసి పంపవలెను.

2. గ్రంథమాల ప్రకృతస్థితిలో గ్రంథకర్తలనేరీతిగను బహూకరింపనేరదు. ఉచితముగనే గ్రంథము లిచ్చుచుండ వలయును.

3. పుస్తకములందుగాని, పుస్తక భాగములందుగాని, వలయుమార్పు లొనరించుటకు మేనేజింగు ఎడిటరుగారికి సర్వాధికారము లుండును.

4. ప్రథమ ముద్రణముయొక్క ప్రతులపై గ్రంథకర్తల కేలాటి హక్కులులేవు. గ్రంథమాలకు రెండవ ముద్రణము మరు సంవత్సరముననో, అంతకుముందో కావలసియున్న యెడల గ్రంథకర్తల యొక్క ఆక్షేపణ యుండకూడదు. రెండవ సంవత్సరము ముగిసిన తర్వాత గ్రంథములపై గ్రంథమాల కెట్టి అధికారమును లేదు.

5. ముద్రణమైన వెంటనే 50 ప్రతులు మాత్రము గ్రంథకర్త కివ్వబడును. గ్రంథకర్తలు, గ్రంథమాలాభివృద్ధిని కోరి, చందాదారులాది పోషకులను చేర్పించి సహాయ పడవలయునని విన్నపము.

6. గ్రంథమాల పుష్పములను, గ్రంథకర్తయొక్కయు సంపాదకులయొక్కయు అనుమతిలేక యెవ్వరుగాని, యేభాషలో గాని భాషాంతరీకరణము చేయకూడదు, ముద్రింపగూడదు. అనుమతి పొందక నాటకములను కూడా ప్రదర్శింపకూడదు.

7. కార్యనిర్వాహక సభ్యులలో మెజారిటీ సభ్యులు ముద్రణకు యోగ్యమని, ముద్రింపఁబడు గ్రంథముపై లేక గ్రంథ భాగము లేదా రచనపై, తమ యభిప్రాయ మొసఁగవలయును. లేకున్న అయ్యది ముద్రింపఁబడదు.

8. పై నిబంధనలందు మార్పులొనరించుటకును, క్రొత్తగాఁ జేర్చుటకును, రద్దు జేయుటకును, గ్రంథమాలాధ్యక్షులకు, సంపాదకులకు, కార్యనిర్వాహక సభ్యులకును సంపూర్ణాధికార ముండును.

ఇట్లు,
సంపాదకుఁడు.

## గ్రంథమాలా ఆనరరీ వర్కర్సు

ఈ క్రిందివారు గ్రంథమాల యందాదర బుద్ధివహించి దాని పురోభివృద్ధిని కాంక్షించి చందాదారులు, అభిమానులాదిగాగల వారిని చేర్పించి, గ్రంథమాలకు సహాయము చేయుచున్నారు, వారికి కృతజ్ఞులము. చందాదారులు అభిమాను లాదిగాగల వారందఱు, ఈ క్రిందివారికి, తమ చందా, విరాళ మొత్తములను చెల్లించి, వారినుండి అచ్చురశీదులను, తమకు రావలసిన పుస్తకములను పొందవలయును.

1. శ్రీ విద్వాన్ గొల్లాపిన్ని వాసుదేవశాస్త్రిగారు, తెలుగు పండితులు, ఉరవకొండ.

2. శ్రీ అవ్వారి నారాయణగారు, తెలుగుపండితులు, బోర్డు హైస్కూలు గంగవరము, (కల్యాణదుర్గము తా॥)

3. శ్రీ యం. పుల్లమరాజుగారు, తెలుగుపండితులు, బోర్డు హైస్కూలు, బుక్కరాయసముద్రం (అనంతపురం)

4. శ్రీ యన్. వెంకటరామయ్యగారు, అసిస్టెంటు టీచరు, బోర్డు హైస్కూలు, వామిడి (అనంతపురం)

5. కరణం సుబ్బరావుగారు, పెద్దవడుగూరు, (గుత్తి తా॥)

6. శ్రీ విద్వాన్ ఘూళీ కృష్ణమూర్త్యాచార్యులుగారు, తెలుగు పండితులు, మునిసిపల్ హైస్కూలు, బళ్లారి.

7. విద్వాన్ జెళ్ళూరి శ్రీనివాసమూర్తిగారు, తెలుగు పండితులు, బోర్డు హైస్కూలు, కల్యాణదుర్గము.

8. కె. జానకిరామరావు, కాలేజివిద్యార్థి, Extentions అనంతపురం,

9. శ్రీ సోంపల్లి కృష్ణమూర్తిగారు, తెలుగు పండితులు, కదిరి.

10. శ్రీ తుంపర్తి పుల్లయ్యగారు, రిటైర్డు టీచరు, ధర్మవరము.

బళ్ళారి, కర్నూలు కడప, చిత్తూరు జిల్లాలయందును ఆంధ్రరాష్ట్ర ముఖ్యపట్టణములయందును కమీషన్ పద్ధతిగా పనిచేయువారికి మంచి కమీషన్ ఇవ్వబడును.

వివరములకు :— మేనేజింగు ఎడిటరు,
శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమాల,
12/433 నింకంపల్లి రోడ్డు, హిందూపురము
(అనంతపురం జిల్లా) అని వ్రాయవలెను

---

శ్రీ విష్ణు ప్రింటర్సు, హిందూపురం.

# తప్పొప్పుల పట్టిక

## ఆంధ్రాభ్యుదయము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 4 | కర్ణ! భీభత్సమై | కర్ణభీభత్సమై ! |
| ,, | 10 | వోరెదవు | పోరెదవు |
| 3 | 6 | పర్యంబు | పర్వంబు |
| 4 | 11 | నిష్టా | నిష్ఠా |
| ,, | 13 | అన్యోన్యతి | అన్యోన్యమతి |
| ,, | 14 | చింతాశూన్య | చింతాశూన్యము |
| ,, | 18 | లభింపఁ | లయింపఁ |
| 5 | ,, | కళాప్రశక్తి | కళాప్రసక్తి |
| ,, | 3 | క్రమము | క్రమము |
| ,, | 6 | కథానికల్ | కథానికలన్ |
| ,, | 7 | చూతు | చూత |
| ,, | 17 | ఆఖండకావ్య | అఖండకావ్య |
| 6 | 5 | ఘంఘమ | ఘుంఘుమ |
| ,, | 6 | వేసుభాషణములు | వేదభాషణములు |
| ,, | 16 | యెనో్న | యెన్నొ |
| 7 | 4 | కొదువ | కొదవ |
| ,, | 7 | దీధితుల్ | దీధితులన్ |
| 8 | 4 | మంత్రధ్యాన | మంత్రధ్వాన |
| ,, | 10 | హృదయమం | హృదయమున్ |
| 11 | 2, 6, 10 | కనుదోయి | కనుడోయి |
| ,, | 13 | యుత్సాహ | యత్యుత్సాహ |
| ,, | 18 | ఝురి | ఝురి |

# అమృతాభిషేకము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 12 | 15 | కంపించి | కంపించు |
| ,, | 16 | పల్కు—; నాచిలుక | పల్కు—నాచిలుక |
| 14 | 15 | లయించిదో | లయించినదో |
| 16 | 7 | సత్యశీల | సత్యశీలి |
| 16 | 8 | జోహారు | జోహారు |
| 17 | 1 | అలఅశోకుని | అలయశోకుని |
| ,, | 5 | పతాకచ్ఛాయ | పతాకాచ్ఛాయ |
| ,, | 16 | గట్టిగ | గట్టుగ |
| 18 | 15 | క్రమములో | క్రమములిలలో |
| 19 | 7 | తనుకావించిన | తనకావించిన |
| 20 | 19 | నీకును | నీకుము |
| 21 | 7 | భిన్నమతి | ఖిన్నమతి |
| ,, | 17 | జాత్యాభిమానంబు | జాత్యభిమానంబు |
| 22 | 2 | క్షణికముగాగ | క్షణికముగా |
| ,, | | ౧౭ | ౧౫ |

## వెన్నెలతీగలు

| | | | |
|---|---|---|---|
| 34 | 20 | చెఅపుదెచ్చి | చెలుపుదచ్చె |
| 40 | 14 | వనమయూారనృత్య | వనమయూరమునృత్య |
| 41 | 3 | పరమతత్వ | పరతత్వ |
| 44 | 22 | బోలి | బోలు |
| 45 | 17 | పండించు | పండించి |
| శివదర్శనములో— | | ప్రథమ | ప్రమథ |
| 47 | 10 | లూగించి | లూగించు |
| 48 | 12 | లేనయ్యొ ! | లేనైతి ! |

## ఋతులక్ష్మి

| | | | |
|---|---|---|---|
| 53 | 18 | ఝుంకారవమ్మొ | ఝుంకారరవము |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 54 | 17 | నందించె నేము | నదించె నేమొ |
| 57 | 11 | రాశిక్యము | రాసిక్యము |
| 58 | 13 | చేతుల | చేతల |
| 60 | 20 | చరింతు | దరింతు |
| 61 | 4 | ర్వా | ర్వా భి |
| ,, | 5 | ధద్యుతులు | ధీధితులు |
| ,, | 8 | యలరించెద | యలరించెదు |
| ,, | 9 | నిర్ఝరంబు ! | నిర్ఝరంబ ! |
| ,, | 11 | నిల్వాలి | నిల్వాని |
| 62 | 11 | మేగెన్ | మేగన్ |
| ,, | 14 | ప్రేమతీవెల్ | ప్రేమవల్లీ |
| ,, | 18 | ఖురశ్రేణుల్ | ఖురశ్రేణులన్ |
| 64 | 2 | సంక్రాతముల్ | సంక్రాంతముల్ |
| 65 | 6 | భంగిమన్ | భంగిన్ |
| ,, | 6 | కాంతా ! | కాంత |
| ,, | 17 | హేమ | హేయ |
| ,, | 18 | రుద్ధుడై | శుద్ధుడై |
| 66 | 14 | ప్రోసితిని | ప్రోసెడిని |
| ,, | 14 | నాందిపల్కులన్ | నాందిగూర్చుచున్ |
| ,, | 14 | ప్రకృతీసుబోధముల్ | ప్రకృతిప్రబోధముల్ |
| 67 | 7 | తన్మ్రుడు | తన్మృదు |
| 68 | 6 | పాణీయ | పానీయ |
| 68 | 13 | నమస్కృతి | నమస్కృతి |
| 71 | 7 | దిశల | దశల |
| 71 | 14 | వెలదీసి | వెలవోసి |
| 71 | 16 | గాదా ? | గాథా |